CIBA Cosmetics




బినాకా జూనియర్ డిలక్స్ టూత్ బ్రష్షులను చూస్తే మీ పిల్లలు ఎగిరి గంతులువేస్తారు. అవి క్రొత్త రాకెట్ ప్యాకులో వస్తున్నాయి. అః మూడేళ్ల పైబడిన పిల్లలకై ప్రత్యేక ముగా తయారుచేయబడినవి. వాటి గుండ్రని నైలాన్ కుచ్చులు పిల్లల నాజూకైన ఖిగుళ్లకు హానిచేయవు.

బినాకా టూత్ బ్రష్షులు అన్ని వయస్సు లవారికి తగినవి మరియు అందరికీ నచ్చుతాయి

పెద్ద స్టాండర్డ్, డీలక్స్ మరియు షార్ట్ హెడ్, జూనియర్ స్టాండర్డ్ మరియు డీలక్స్, బేబీ స్టాండర్డ్ మరియు డీలక్స్.



# రయ్‌మని వస్తున్నాయి బినాకా రాకెట్లు

పళ్లను తెల్లగా మెరిసేలా చేస్తాయి...



బినాకా టూత్ బ్రష్షుల నైలాన్ కుచ్చుల చివర్లు గుండ్రముగా ఉంటాయి కనుక అవి ఖిగుళ్లను కోసివేయవు.

ULKA-CTB-61 TL

# గెలుపు, సంరక్షణ లేకపోతే రాజీ

వియత్నాం యుద్ధం గురించి, చెయినా— ఇండియా కలహం గురించి ఎందరో ఎన్నో అనగా, రాయగా లేనిది తెలంగాణా—ఆంధ్ర ప్రాంతాలని గురించి ఏర్పడిన స్పర్ధలని గురించి కొన్ని వర్గాల మధ్య ఏర్పడిన విరోధాలని గురించి ఈ రెండు ప్రాంతాలకీ చెందని వ్యక్తులు ఎందుకు రాయరు? దేశం అంతటా ఎందరో పత్రికా విలేఖరులు చేస్తున్న పని ఇదే!

ఏకపక్షంగా ఒక సమస్యకి సంబంధించిన వ్యాఖ్య జరిపినప్పుడు వ్యాఖ్యాత నిష్పక్షపాతికాదనే ఆరోపణ వెయ్యటం అటువంటి ఆరోపణ చేసేవారి మానసికాందోళనని మాత్రమే బయటపెడుతుంది. న్యాయాన్యాయాలంటే ఏమిటో నిర్ణయించిన తర్వాత న్యాయం జరిగినదీ లేనిదీ యదార్థంగా జరిగిన విషయాలే బయటపెడతాయి.

తెలంగాణా ప్రాంతం ఆంధ్రప్రదేశ్‌లో ఒక భాగంగా ఉన్నప్పటినుంచి ఆ ప్రాంతం ప్రజలకి జరిగిన 'అన్యాయా'లని గురించి అందరూ మాట్లాడుతున్నారు. ఈ 'అన్యాయాలు' రెండు రకాలు. ఒకటి, డబ్బుకి సంబంధించినది, రెండవది ఉద్యోగాలకి సంబంధించినది.

డబ్బుకి సంబంధించినంత వరకు అన్యాయాలు జరగలేదని ఈ విలేఖరి ఇంతకీ మునుపు ఈ పత్రికలో పడిన వ్యాసాలలో స్పష్టంగా చూపించాడు. అసలు ఈరకం అన్యాయాలు జరిగినట్లు వప్పుకున్నవారు వేయించిన లెక్కలని పరిశీలించగా తెలిసిన విషయం ఇది. అంటే, న్యాయాన్యాయాలు నిర్ణయించవలసిన వారే ఒక పక్షం ఉండి పోయారన్నమాట.

ఇక ఉద్యోగాల సంగతి తీసుకుంటే, తెలంగాణా ప్రాంతంలో ఆ ప్రాంతానికి చెందనివారు చేస్తున్న ఉద్యోగాల సంఖ్య చాలా తక్కువ అని అందరికీ తెలిసినదే. అంతేకాక, ఈ ఉద్యోగాలు చాలా వరకు గుమాస్తాగిరి, ఉపాధ్యాయ వృత్తి మొదలయిన వాటికి సంబంధించినవి. ఈ రకం ఉద్యోగాలతో ఆంధ్రప్రాంతంవారు తెలంగాణా ప్రాంతాన్ని దోచుకోనూలేదు వారిని 'రెండవరకం' జనంగానూ చూడలేదు!

అయితే, ఇంత ద్వేషానికీ, హింసాకాండకీ కారణం ఏమిటి? సుమారు పదమూడు సంవత్సరాలుగా లేని చైతన్యం ఇప్పుడు అమాంతం ఎలా పుట్టుకు వచ్చింది?

రాజకీయాలవల్లనే, అని సమాధానం చెప్పుకోవలసి వస్తోంది. కాని, ఇది ఇటువంటివర్షతో తార్కిక సిద్ధాంతాలతో ముగిసే సమస్యకాదు— రాష్ట్ర సమయిక్యత, దేశభవిష్యత్తు మాటలలో ఉంచి కొన్ని వేల అమాయక ఆంధ్ర కుటుంబాల వారి జీవితాలతో చెలగాటం ఆడే సమస్య.

ఈ సమస్యకి పరిపాలకులు— వారు ఏ ప్రాంతం వారయినా కానివ్వండి— పరిష్కారం కుదిర్చే స్థితిలో లేరని గత ఆరునెలల చరిత్రే చెప్తోంది.

అంటే, నేటి ఆంధ్రప్రదేశ్‌లో ఎవరికి తోచిన ఏర్పాట్లువారు చేసుకొనటం తప్ప గత్యంతరంలేదని అనవలసివస్తోంది. రాజధాని అనబడే హైదరాబాదులోనే సామాన్య ప్రజకి సంరక్షణ లేనప్పుడు ఎక్కడో తెలంగాణా లోపల ఉన్నచిన్న ఉద్యోగులని ఎవరు రక్షిస్తారు? ఈరకం వ్యక్తులకి రాజకీయాలలో ఎంత మాత్రం పలుకుబడి ఉంటుంది? (రాజకీయనాయకులనబడే వారి యుద్ధాలతో వారికేమి సంబంధం?)

రాష్ట్ర రాజధానిలో ఉంటున్న ప్రభుత్వమే వారికి సంరక్షణ కలిపించలేనప్పుడు ఎక్కడో వెయ్యి మయిళ్ల అవుతలఉన్న కేంద్రప్రభుత్వం వారిని కాపాడు తుందనుకొనటం కల్ల. అంతేకాక అలజడి చేసినంత మాత్రాన రాష్ట్రాన్ని రెండు (లేక అంతకన్నా ఎక్కువ) ముక్కలు చెయ్యటం ఢిల్లీ నాయకులకి నచ్చకపోవచ్చు.

ఇంకొక విధంగా చెప్పాలంటే, ఇటు రాష్ట్ర నాయకుల సంరక్షణాలేక, అటు కేంద్రనాయకుల సంరక్షణాలేక ఆంధ్రప్రదేశ్ అనబడే రాష్ట్రంలో ఆరు నెలలుగా కొన్ని వేలమంది అమాయకులు అమానుషమయిన హింసకి లోనవుతున్నారు, విద్యార్థుల చదువు ఒక సంవత్సరం చెడిపోయింది, ఎంతో ధననష్టం కలిగింది, కొన్ని తరాలదాకా మాయని ద్వేషాలు రగులుతున్నాయి.

ఈ పరిస్థితిని చక్కపెట్ట గలిగిన వారెవరో ఈ విలేఖరికి తెలియదు, కాని, వీలయినంత దాకా ఆపని చెయ్యగల్గిన వారందరూ, అవసరం అయిన వారందరూ తెలంగాణా ఉద్యమం నాయకులతో సంధి ప్రయత్నాలు చేసుకొనడం తప్ప వేరే మార్గం లేదని మాత్రం తెలిసిపోయినదని నమ్ముతున్నాడు. ఆరునెలలుగా జరుగుతున్న రాజకీయ యుద్ధంలో జయం వారిదే.

సంధి తర్వాత రాజీపద్ధతులు చాలా ఉంటాయి. ఎప్పుడో ఒకప్పుడు తెలంగాణా రాష్ట్రం ఏర్పడటం మాత్రం అనివార్యం అని ఈ విలేఖరికి తోస్తోంది. దీనిని గుర్తిస్తే అందరికీ నచ్చే పథకాలు ఎన్నయినా వేసుకొనవచ్చు.

—రా



## రై. డబ్ల్యు. టి.లు

1968—69 లో 1,11,75,000 మంది టిక్కెట్టు లేని ప్రయాణికులను పట్టుకుని వారివద్ద నుంచి సుమారు 4 కోట్ల రూపాయలు వసూలు చేసినట్టు ఆ శాఖ చెప్పింది. అనగా నెలకి కనీసం పది లక్షల మంది టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేస్తున్నారనమాట—

* * *

మొన్నొచ్చిన గాలివానలో కలకత్తా వద్ద కల్లాయిలో ఒక యింటి మీద రెండు చెట్లు విరిగి పడ్డం వల్ల లోపలాడుకుంటున్న ఆరేళ్ళ కుర్రాడు నలిగి చనిపోయాడట. ఆ యింట్లో వున్న మరో ఏడుగురు గాయాలతో ఆసుపత్రిలో చేర్చబడ్డారట— మొన్నీమధ్య సంభవించిన ఆంధ్రాలోని ధనప్రాణనష్టాలతో సరిపోల్చదగినదేదీ లేదనేది వేరే విషయం.

* * *

మద్రాసు రాయపురంలో తళుక్కటమ్మన్ కోవిల్ వీధిలో కొందరు పసిపిల్లలు ఆడుకుంటున్నారట. వున్నట్టుండి ఎక్కడినుంచో ఒక తుపాకిగుండు దూసుకువచ్చి ఆడుకుంటున్నఒక పిల్లాడికి తగిలిందట. అపిల్లాడు చావు బ్రతుకులమధ్య ఆసుపత్రిలో వున్నాడట

## బొట్టు పెట్టుకోడానికి సిగ్గు

ఏ రంగు బట్టలకు ఆ రంగు గాజులు, ఆ రంగు చెప్పులు ధరించడమే గాక, అదే రంగు బొట్టు పెట్టుకోడము యీనాడు ఆధునిక నాగరికతా లక్షణం (!) అయితే ఎర్రని బట్టలు వేసుకున్న వారు మాత్రం ఎర్రని త్రికోణం వంటి బొట్టు పెట్టుకోడానికి సిగ్గుపడుతున్నారట కారణం అది విశ్వవ్యాప్తమయిన కుటుంబ నియంత్రణ చిహ్నం కదా! ఈ సిగ్గుపడే వారిలో పెళ్ళికాని వారు మరింత సిగ్గుపడుతున్నారట—







## చనిపోయిన బిడ్డ ఎవరు?

తనకు అందచేసిన పసిపిల్లాడి శవాన్ని చూస్తే 'ఇది నా కొడుకు శవం కాదు. నా కొడుకు చనిపోలేదు ఇది అక్రమం, కుట్ర. నా పిల్లాడిని మార్చేసి, చనిపోయిన ఎవరి పిల్లాడినో నాకిస్తున్నారు' అని బొంబాయిలో పోస్ట్ అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసులో పని చేస్తున్న వగ్యాన్ రామచంద్ర గాడ్వే అనే ఆయన 'కె ఇ యమ్' ఆసుపత్రి అధికారుల మీద ఫిర్యాదు చేశాడు. ఆసుపత్రి పుస్తకాలలో చనిపోయిన పిల్లవాని ఎడ్రసు వేరే వున్నదని, దానిని చెరిపేసి, ఆ ఎడ్రసు మీద తన ఎడ్రసు రాశారని, తన భార్య ప్రసవించాక తల్లి, పిల్లాడూ ఆరోగ్యంగా వున్నారని తనకు వారే చెప్పారని 14 గంటలు పడిగాపులు గాచినా తనకు తన పిల్లాడిని, భార్యను చూసే అవకాశం యివ్వలేదని, మర్నాడు మధ్యాహ్నానికల్లా యిలా తారుమారు చేసి, 'నీ పిల్లాడు చనిపోయాడు.' అని బుకాయిస్తున్నారని, తన కొడుకుకు నెత్తి మీద జుట్టు చాలా పల్చగా వున్నట్టు వారే చెప్పారని తన కిచ్చిన బాలుని శవానికి నెత్తి మీద చక్కని ఒత్తైన జుట్టు వుండనీ—యివన్నీ చూస్తే తన పిల్లాడిని కావాలని మార్చివేశారని తెలుస్తున్నదనీ, తనకు న్యాయం చేకూర్చాలని అతను చట్టాన్ని శరణు కోరాడు. ఈ విషయం దర్యాప్తు చేస్తోంది చట్టం

*

పిండిమర చక్రం నుంచి బెల్టు లాగేద్దామని ప్రయత్నించిన 30 ఏళ్ళ వ్యక్తిని ఆ పిండిమర చక్రం గిర్రున తిప్పి బెల్టులోకి లాగేసిందట దాంతో అతని రెండు కాళ్ళు అందులో యిరుక్కుని, విస్సురున వెళ్ళి చక్రంలో పడి, నలిగి చనిపోయాడట పిండిమరలలో యిలాటి సాహసాలూ, సర్కసులూ చేస్తూనే వుంటారు.

* * *

ఢిల్లీ విశ్వవిద్యాలయానికి చెందిన డాక్టర్ శివపురి అనే ఆయన పాకుడుల్లోంచి వుబ్బసానికి మందు కనిపెట్టారట. టిటానిక్ యాసిడ్ అనే ద్రవాన్ని వుపయోగించి సముద్రపు అలల మీద యురేనియం తీయడంలో జపాను విజయం సాధించిందట. అమెరికాలో 210 లక్షల మంది పొగత్రాగడం మానేశారని అమెరికన్ కాన్సర్ సొసైటీ ప్రకటించింది. మధుర దగ్గరలో ఒక కొండ మీంచి 75 అడుగుల లోయలోకి ఒక టూరిస్టు బస్సు దొర్లిపోయినందువల్ల 11 మంది చనిపోయారట పెక్కుమంది గాయపడ్డారట.

## జూబుజుట్టు ఫాషన్ - బార్బర్ షాపు మూత

'ఈ రోజుల్లో జూబజుట్టు ఫ్యాషనైపోయింది. వున్న జనంలో సగం (?) ఆడవారు మిగతా సగంలో కొంతమంది బట్టతలవారు— యికపోతే మిగిలిన వారు— సిరిలో జూబజుట్టు పెంచుకునేవారు ఎక్కువ మంది అయిపోయారని— 'బీటిల్స్' ధర్మమాని యీ జుట్టు ఫ్యాషనవడం వల్ల నా వ్యాపారమే సర్వనాశనం అయింది' అని క్యూబాలో ఒక బార్బరు షాపు యజమాని గోల పెట్టాడట విశ్వఖ్యాతి చెందిన తన షాపును ఆయన మూసేశాడట—



## లిట్ క్విజ్ నెం 51 — 18 క్లూలు

1. మనం మనకోసమే జీవించడం విరమించుకొన్నప్పుడు మాత్రమే జీవనం సాహస/సంపత్తియుత మగుట కారంభమగును.

2. కల్పన లేకుండా సజీవత / దృష్టి వుండదు మరియు సృష్టి వుండదు.

3 సముద్రంవలెనే మానవ జీవన సత్వం అంతులేనిది / క్రియాశీలమైనది.

4 మనం చూస్తూవుండే నలువైపులా మనలను ఆవరించి యున్నట్టి ఆనందాలు ప్రదర్శనములు, సుందరతా మరియు ఆకర్షణ శక్తులతో నిండియున్న లోకం నిరంతర పరివర్తన/అంతర స్పర్ధకు స్థానమై యున్నది.

5 ధనికుల ఆశకంటె బీదల భీతి ఎక్కువ ప్రేరణ శక్తివంతం. ఈ యదార్థం, విపత్తును సృజనశీల / సాముదాయిక పురుషార్థానికి సహకారిగా నుండచేస్తుంది

6 మానవ ప్రకృతి ఎట్టిదైనా సరే క్రొత్త సంవత్సరం అనగా పెద్దలకు ప్రార్థన, ప్రాయశ్చిత్తం, మరియు సమర్పణ/సంకల్పం అటులే పిన్నలకు దుస్తులు, కానుకలు, విరామం, మరియు మిఠాయిలు అయివున్నది.

7. మన ఆదర్శాలు మనకార్యములను/అదృష్టం అదుపుచేసి మరియు నిర్ధారణచేయును.

8. వివిధత / ఏకత భారత దేశమునకు ఎంత విశిష్టతయై వున్నదో కళాక్షేత్రమందు ఈ అభివ్యక్తికంటె ఎక్కువగా ఏమాత్రమూ విశదంగా చెప్పబడలేదు

9 ఉదాహరణ / అనుభవం శిక్షకుల ప్రవీణతల్లో నొకటి భాషా ప్రాముఖ్యత లేకుండా బోధించినప్పటికీ.

10 జీవనంలో మీ అత్యంత ముఖ్యమైన సంపత్తి మంచిఆరోగ్యం/వినోదం,దానినిఆర్జించి నిలుపుకొనుట మీ ఉద్దేశ్యమై యుండవలెను.

11. మనకందరకు మానవతా / వినోద భావం ఉండుట సహజం

12 ఆంతరిక శుద్ధత లేకుండా అసలైన వినమ్రత / నైతికత వుండజాలదు.

13. వివేకం కాదు, కల్పన/నకలు చిన్న పిల్లల జీవనమును నడుపుతుంది

14 న్యాయం/సహనం ఒక ఘనమైన సద్గుణం ఇది లోకమంతటా పూర్తిగా ఆచరింపబడే యెడల లోకమంతట్లో సగం కష్టాలు మాయమైపోతాయి.

15 పుష్పంమొదలుకొనిమనిషివరకు ధరిత్రిపై గలన్నివస్తువులు ప్రేమ లేక చింతనవిషయం, బౌద్ధిక ప్రయోజనం మరియు ఉత్కంఠా/స్వామిత్వం విషయం అయి వుండగలదు

16 అంతఃకరణతరుచుగా కవుల/బీదల హృదయంలో అత్యంతప్రకాశమానంగా వెలిగేజ్యోతి.

17 జీవియొక్క భౌతిక జ్ఞానం శాశ్వత ఐక్యతను ఎన్నటికీ పునఃస్థాపితం/ప్రకటితం గావింప నేరదు.

18. ఆవశ్యకత/పని లేకుండా ఎవ్వరూ జీవింపజాలరు.

## No. 51: 18 CLUES

1. Life only begins to be an **Adventure / Asset** when we cease living it for ourselves.
2. Without imagination there is no **Animation / Vision** and no creation.
3. The spirit of life in man like the sea itself, is **Boundless / Restless**
4. The world we see around us, with its pleasures shows, beauty and temptations, is a place of incessant **Change / Conflict.**
5. The dread of poverty is even a stronger urge than the hope o riches and this fact makes adversity an ally of **Creative / Cumulative** effort.
6. Human nature being what it is, New Year means prayer, penitence and **Dedication / Resolution** for the elders, as it means clothes gifts a holiday and sweetmeats for the younger people
7. Our ideals control and determine our **Deeds / Destiny**
8. The **Diversity / Unity** that is India is no-where more clearly felt than in her expression in the realm of art
9. **Example Experience** is one of the most potent of instructors, thou'n it teaches without a tongue
10. Your most important asset in life is good **Health / Humour**, and it should be your aim to preserve it.
11. All of us have an innate sense of **Humanity / Humour.**
12. Without inner purity there cannot be true **Humility / Morality**
13. **Imagination / Imitation,** not reason, rules the life of a little child.
14. A glorious virtue is **Justice / Tolerance,** and were it universally practised half of the woes of the world would disappear.
15. All things on earth from a flower to a human being, can be an object of love or contemplation an object of intellectual interest and an object of **Passion / Possession**
16. Conscience is a flame which often burns brightest in the hearts of the **Poets / Poor.**
17. Material sense will never **Restore / Reveal** the permanent harmony of being.
18. No man can live without **Want Work.**

గమనిక: పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి [illegible] అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లిట్ క్విజ్ వీక్లీలో ప్రచురింపబడును.

## ఒకవారం విపరీతం

## నిద్రపోతున్న వారిపై ట్రక్కుతోలిన లైసెన్సులేని డ్రైవరు

డ్రైవింగు లైసెన్సు లేని పెద్దమనిషి ఒకతను బొంబాయిలో ట్రక్కు తోలిన (జూన్ 3 తెల్లారు జామున) ఫలితంగా రోడ్డు పక్కన పేవ్‌మెంటు మీద నిద్రపోతున్న అమాయకులు 19 మంది పచ్చు పచ్చు అయ్యారట. వీరి నాసుపత్రిలో చేర్చారు.

## ఆజ్ఞలు - మార్పులు!

1963 లో 60 వేలు ఖర్చుచేసి కట్టిన ఒక ప్రయిమరీ స్కూలు భవనంలోకి యీనాటి వరకు ఆ స్కూలు మార్చనే లేదట ఎవరూ ఆ స్కూలు అలానే అద్దెకొంపలో వుందట అదేమంటే ఆ భవనాన్ని బ్లాక్ డెవలప్‌మెంటు వారు విద్యాసంస్థకు యివ్వాలని, విద్యాసంస్థవారు స్కూలును కొత్త భవనంలోకి మార్చమని ఆజ్ఞ యివ్వాలనీ అప్పుడు మార్చ వీలవుతుందనీ అన్నారట పోనీ ఆజ్ఞ యివ్వచ్చుగా అంటే బ్లాక్ డెవలప్‌మెంటు వారు విద్యాసంస్థాధికారులకు ఆ సందర్భంలో యివ్వాల్సిన కొన్ని కాగితాలు అవి కనబడటంలేదట అవి కనబడే వరకూ ఆ స్కూలు అలాగ అద్దెకొంపలోనే వుండాలనీ, ఆ కొత్త భవనంలో గబ్బిలాలూ, కుక్కలూ కాపరాలు వుండాలనీనా— ఏవిటో కాశీ మజిలీ కథలకో చీడీ తరువాయిగా వుంది కథ.

## వారణాశిలో ఆచూకీ తెలియని శవాలు

వారణాసిలో గత ఇరవై రోజులలో నాలుగు శవాలను పోలీసులు కనుగొన్నారట. ఈ నాలుగూ చెట్లకు వురితీసినట్లు వ్రేలాడుతున్నవేనట, ఏ ఒక్క శవాన్ని ఎవరూ గుర్తు పట్టలేకపోయారట. హత్యో ఆత్మహత్యో తెలిని యీ కేసులు ఒక దరికి రాలేదు. మొన్న జూన్ 4 వ తేదీన 22 ఏళ్ళ కుర్రాడి శవం ఉదయప్రతాప కాలేజి పక్కనున్న [illegible] చెట్టుకి వ్రేలాడుతూ దొరికింది.



# తప్పెవరిది?

కుమారి ఎస్. రంజానీబి

సాయంకాలం ఐదుగంటల సమయంలో మోకాళ్లపై తలపెట్టుకొని నేలను చూస్తూ ఇసుకలో పిచ్చిగీతలు గీస్తూ బీచ్‌లో కూర్చున్నదామె. పొడవుపాటి ఆమె జడ వీపుమీదినుండి జారి భూమితో ముచ్చట్లాడుతున్నట్లుగ ఆమె కదులుతున్నప్పుడల్లా జడ కదులుతుంది.

మహావరాని స్వచ్ఛమైన జీవితానికి ప్రతీకగా సముద్రం నురగలు కక్కుతూ కనుచూపుమేర తెల్లనిబట్ట ఆరవేసినట్లుగావుంది. చెట్లలోనుండి దోబూచులాడే సూర్యకిరణాలు సముద్రునితో మంతనాలు జరుపుతున్నట్లుగా ఆ కిరణాల వేడికి వాడికి అలలు పరవశించి ప్రణయగీతాన్ని ఆలాపిస్తున్నట్లు ఆనందంతో ఎగిరి గంతులేసి విరిగిపోతున్నాయి రెప్పపాటులోనే.

భారత దేశంలోని కరువంతగా వున్నది ఆమె ఎదురుగావున్న సముద్రం! 'సముద్రంలోని గాంభీర్యత, సముద్రమంత విశాలత, సముద్రపులోతు అందరికీ వుంటాయా?' అనుకున్నాదామె తలెత్తి సముద్ర లాస్యవిలాసాలను మూగగా చూస్తూ...

'అంతటి విశాలహృదయం యీ విశాల ప్రపంచంలో ఎందరికుంటుంది?' అని మరోమారు గొణుక్కుంది.

తలెత్తి నలువైపులా ఒక్కసారి తేరి పార చూచింది ఆమె. దూరంగా వూసులాడుకుంటున్న జంటల జంటల మనుష్యులు! ఆనందంతో కేరింతాలు కొడుతూ ఆడుకొంటున్న పిల్లలు! ముసిముసి నవ్వులతో గుసగుసలాడు కొంటున్న ప్రేయసీ ప్రియులు! అందరి హృదయాలలో ఆనందమే! అందరి మనసులలో సెలయేటి గలగలలే! అంతా కోలాహలమే!

ఎదురుగా వున్న సముద్రం ఆంధ్రప్రజలెందుకిలా ఐక్యమత్యాన్ని కోల్పోతున్నారు? అన్నట్లుగా ఘోష పెడుతుంది.

ప్రపంచంతో జరిగే అన్యాయాలను అక్రమాలను మేము చూడలేక పోతున్నామన్నట్లు ఆక్రందన చేస్తున్నట్లున్న అలలు ఎగిసి ఎగిసి పడుతున్నాయి!

ఆమె హృదయంలోనూ సముద్రఘోషలాంటి ఘోషే!

పరితాపంతో తపించి పోతున్న ధా

దేశంపై ద్వేషంతో తల్లడిల్లి పోతున్న దామె!

మోసం చేసే మనషులపై చీదర భావంతో చింతిల్లుతున్న దామె!

రెండు చేతులను కాళ్లకు చుట్టుకొని మరోసారు ఆమె శూన్యంలోకి చూస్తూ ఏవేవో అర్థాలను పరార్థాలను వెతుకుతున్నదామె!

పెనుతుఫానులకు, ఫిరంగులకు కూడ కదలలేని ఓ భయంకర పర్వతంలా నిశ్చింతగ నిర్భయంగ కూర్చుండి పోయిందామె.

దూరంగా కాలేజీ పిల్లలు అలలపై బంతి ఆట ఆడుతూ గెంతుతూ కేరింతలు కొడుతూ ఆడుకొంటున్నారు.

సృష్టిలోని సర్వ రహస్యాలు తెలిసిన ఓ దివ్యజ్ఞానిలా సన్నగా నవ్వుకున్న దామె! ఆ పిల్లలలో అపుకోలేని ఆనందం! పళ్లు తెలియని పరవశత్వం మాత్రమే వున్నది!

వయస్సులో వున్న యువతికి మనస్సు తుళ్లటం సహజమే! తత్ఫలితంగా కాలు జారితే ఎంతగా 'కుళ్లి కుళ్లి ఏడ్వవలసి వస్తుందో వాళ్లకేం తెలుసు పాపం! వాళ్లకిప్పుడు తెలిసినదల్లా తుళ్లటమే! సెలయేరులా పరుగులిడే పరువం! నాగుబాములా కుబుసం విడిచే వయసు! ఆ వయసు కది సహజమే!' అనుకుంది నిర్లిప్తంగా...

ఆమెకు నాలుగు గజాల దూరంలో ప్రేయసీ ప్రియులు గాబోలు ప్రియుని తొడమీద ప్రేయసి పడుకొని కనరాని లోకాలలోకి తేలిపోతున్నట్లుగా అనంతమైన ఆకాశంలోకి ఆశగా ఏదో వెతుకుతున్నట్లుగ చూస్తుంది. ఆమెలో ఆనందం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. 'తనకా భాగ్యం లేదు కదా!' గొణుక్కుంది ఆమె! ఎటు చూచినా ప్రశాంత వాతావరణం. మనసుకు, శరీరానికి హాయి నిచ్చే చల్లటి గాలి. చూచినంత మేరలో కన్నుల పండువ చేసే రకరకాల దుస్తులతో జనం! ఎటు చూచినా ఆనందంగా వున్న ఆమెకు మాత్రం ఆనందం లేదు ఆమె మనస్సు బాండీలో కళ పెళ కాగే నూనెలా వుంది.

ఆమె గొంతులో వున్నది అమృతంకాదు. హాలాహలం!

ఆమె వయస్సు ముప్ఫయిలోపు! పసుపు శరీరఛాయ. తియ్యని వలపుల తలపులకు వాచిపోయినట్లున్న చెక్కిళ్లు! ఏడ్చి ఏడ్చి అలసిపోయినట్లున్న ఆమె విశాలనేత్రాలు ఆ రోజు కాటుకదిద్దిన మూలంగా వింతగ మెరిసి పోతున్నాయి. కుంచెతో తీర్చిదిద్దిన నొసలు! పాలభాగాన విలువపాటి బొట్టు! కోలముఖమైనా కొనదేలిన ముక్కు ఆమె సౌందర్యవతి అని చాటి చెబుతుంది.

దుర్మార్గులైన మానవులను కబళించాలని విశ్వప్రయత్నం చేస్తూ నాగుబాములా నోరుతెరచి బైటకువస్తున్న అలలు! బైటకువచ్చి ఆమెపాదాలను తాకి మరీ వెళ్లిపోతున్నాయి.

గాలివాటుకు దూరానవున్న జంట చెప్పుకుంటున్న మాటలు ఆమె చెవులను తాకుతున్నాయి.

'ఆమె మా ఫిజిక్సు మేడమ్!' అన్నదామె!

'అలానా ? పేరేమిటి?' అతని ప్రశ్న.

'మంజుల' కిల కిలా నవ్విందామె.

ఆ నవ్వు నాగుబాము బుసలుగా చెవులకు తాకింది.

'ఏం! అలా నవ్వుతున్నావు ?' అతడి కంఠం.

'ఆమె దొకవింత కథలే!' హేళనతో నిండిన నవ్వు!

ఆమెగొంతు నలిపివెయ్యాలనిపించింది మంజులకు. ఆమె మాటల బాణాలకు మంజుల మనస్సు తూట్లు పడిపోయింది. ఆమె కడుపులో అగ్నిజ్వాలలు వ్యాపించాయి. రోషం, పౌరుషం ఆవేశంతో కూడుకున్న ఆమెమీద ఎగిసి ఎగిసి పడింది. మరల తన అసహాయతకు, పిరికితనానికి, చేదుగా సాగిపోయే తన జీవితానికి విచారించక విస్పారంగా నవ్వుకుంది.

ఆ నవ్వులో జీవంలేదు!

కళాకాంతులు అంతకన్నా లేవు!

వాళ్లమాటలకు చంద్రబింబంలాంటి ఆమె ముఖంలో రంగులుమారి పాండురోగం మనిషిలాగ ఆమె ముఖం పాలిపోయింది. మనస్సు మూగబోయింది.

'ఛీ ఎందుకలా బేలవై పోతున్నావు ? అంతలోనే బాధపడాలా ?' అన్నది ఆమె లోని పౌరుషం!

'బేలపడక ఏముంది! వాళ్లన్నట్లు నాదొక వింతకథేగా ?' అన్నది ఆమెలోని శాంతం!

పౌరుషానికి—శాంతానికి మధ్య పది నిమిషాలు ఘర్షణ జరిగింది ఆ ఘర్షణతాలూకు శాంతమే నెగ్గింది.

బ్రతుకు దుర్భరంగా నిస్సారంగా సాగిపోతున్నప్పుడు మనిషి అలవర్చుకోవలసిన సుగుణం శాంతం ఒక్కటే! అశాంతితో అలమటించే వారిపాలిట శాంతం అమృతప్రాయమైనది.

కాలం ఎప్పుడూ ఒక్కలాగే వుండదు! కాలంలో ఋతువులు మారుతున్నట్లే మనిషివయస్సు పోటీపడుతూ పెరిగిపోతూనే వుంటుంది.

మంజుల గుప్పిటలోకి ఇసుక తీసికొని కుప్పలు కుప్పలుగిపోస్తూ తన గత విషాద జీవితానికి నాందీగా సన్నగా ఏడుస్తూంది. అలా చాలాసేపు యేడ్చింది. కళ్లు తుడుచుకుంది. తన కంటినీరు తనే తుడుచుకోవాలి. ఎందుకంటే తుడిచేవారు ఆమెకు లేరు!

రివ్వున వీచేగాలి తాకిడికి ఆమెపమిట మహాత్ముడు దేశానికి ఇచ్చిన సందేశంలా ఏదో సందేశమిస్తున్నట్లు రెపరెప [illegible]డుతుంది. మోముపై ముంగురులు నాట్యం చేస్తున్నాయి. సముద్రపు ఘోషలో మార్పు లేదు. అలలు ఎన్నటికీ ఆగిపోవు! అలాగే ఎదలోపలి వేదనకూడ అగదు! బైటకు ఏదోఒక రూపేణా కక్కివేయాలనిపిస్తుంది. ఆమె ఆలోచిస్తూనే వుంది.

ఆమె భుజంపై చల్లని చేతిస్పర్శ తగలటంతో తలెత్తి పైకి చూచింది! 'మేడమ్! మీరా?' అన్నది ఆశ్చర్యాన్ని ఆవేదనను పైకి కనబడ నీయకుండ నటిస్తూ...

'ఆవేదనను దాచిపెట్టటానికి ప్రయత్నం చేయటం అవివేకమమ్మా!' అన్నది మంజుల తలనిమురుతూ...

ఆత్మీయులను చూచినప్పుడే ఆవేదన ఎక్కువౌతుందన్న మాట మంజుల విషయంలో అక్షరాల జరిగి తీరింది. ఆమెలో జ్వాలలా రాజుకుంటున్న వేదనకు చిహ్నంగా జలజలా కన్నీరు చెంపలమీదుగజారి వక్షస్థలాన్ని తడిపివేస్తున్నాయి.

ఆమె రాకతో మంజుల దాదాపు పిచ్చిదైపోయింది. వసుంధరా మేడమ్ ఈవింత విచిత్ర పరిణామానికి ఆశ్చర్య

పడి కలవరపాటు చెందింది.

మంజుల ప్రక్కగా కూర్చుంటూ ఆమె చుబుకాన్ని పట్టుకొని తనవైపు తిప్పుకుంటూ 'ఇలా ఒక్కసారి నావైపు చూడు!' అన్నది మంజుల కళ్లల్లోకి ఆమెకూడ చూస్తూ...

వసుంధరమేడమ్‌కు నలభై ఏళ్ళు దాటకపోయినా డెబ్బయిఏళ్ల అనుభవం ఆమెలో దాక్కొనివుంది. అంతేకాదు ఆమె ఆర్తులపాలిట దేవత! అనాధులపాలిట కల్పతరువులాటిది. పండిన అనుభవాలకు చిహ్నంగా ఆమెలోని జుత్తు అక్కడక్కడ నెరిసిపోయింది. ఆమె కళ్లల్లో ప్రేమ లాలిత్యం కన్పిస్తూ వుంటాయి. బాధతో వేదనతో కృంగిపోయేవాళ్లకు బ్రతుకుమీద ఆశను కల్పించి వారిని ధీరులుగా నిలబెట్టి జీవితంలో ఎన్ని సుడిగుండాలనైన ఎదుర్కొనేటట్లుగ వాళ్లకు సలహాలివ్వటం ఆమెలోని ఆయుధం. తన చల్లనినీడ లాంటి ఆప్యాయతతో ఆర్తిని బాపుతుంది. మాటలలో అనురాగాన్ని ఒలకబోస్తూ తూచితూచి ఎదుటివ్యక్తిని నొప్పింపకుండా మాట్లాడటం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. మంచితనం ఆమెసొత్తు.

మంజుల వసుంధర దాదాపు నాల్గు సంవత్సరాల నుండి ఒకే కాలేజీలో లెక్చరర్లుగా చేస్తున్నా, మంజుల తన స్వవిషయాలు బాధలు ఎన్నడూ వసుంధరా మేడమ్‌తో చెప్పలేదు! చెప్పవలసిన అవసరం కూడా అప్పట్లో అంతగా లేకపోయింది. అప్పుడప్పుడు మంజులలో గల నైరాశ్యం, నిర్లిప్తత, దిగులు వసుంధర మేడమ్ కనిపెట్టక పోలేదు. కాని ఒక విషయాన్ని గురించి ఆరాలు తీసి చర్చించి ఎదుటి వ్యక్తిని బాధ పెట్టటం వసుంధర తత్వం కాదు. ఆమెకు తెలిసిందల్లా ఒక్కటే! సాధ్యమైనంతవరకు ఎదుటి వ్యక్తిని బాధ పెట్టకుండ మాట్లాడటమే! అందుకనే మంజులలో ఏదో బాధ గూడుకట్టుకుని వుందని గ్రహించినా, ఇన్నాళ్ల నుండి ఆమె అడగలేక పోయింది!

ఈ నాటికి మంజులలోని వేదనంతా వెళ్లగక్కే సమయం రానే వచ్చింది. దేనికైనా సమయమంటూ రావాలి!

మంజుల కార్చే కన్నీటిబొట్లు రెండు ఇసుక మీద పడి ఇంకి పోయాయి.



# తప్పెవరిది?

మేడమ్ కళ్లలోకి మంజుల తీక్షణంగ చూచింది.

'ఈమె నా కథంతావిని నన్ను చీదరించు కోదుకదా! ఈమెనుండి నాకు సానుభూతి లభిస్తుందో లేదో!' అని ఆ చూపులోని అర్థం. ఆమె సంశయంకూడా అదే!

ఇసుకలోకి వేళ్లుగుచ్చి నొక్కిపెడుతూ 'మేడమ్!' అన్నది సన్నగా...

మంజుల కంఠంలో ఆర్ద్రత, బాధ ధ్వనించాయి.

'ఏమ్మా! ఏమిటి నీబాధ చెప్పు!' అన్నది ఆమెమాటలో లాలిత్యాన్ని ప్రేమను నింపి.

అటువంటి అనురాగ పూరితమైన మాటకు మొగమువాచిన మంజుల ఒక్కసారిగ వసుంధరను కావలించుకొని భోరున ఏడ్చింది.

సహజంగా మనిషి వేదనతో నలిగి పోయేటప్పుడు అంతస్తు, విలువ, హోదా, అధికారం వీటి వేటినీ కూడ వాంఛించడు. దైన్య పరిస్థితులలో వున్న మనిషికి కావల్సింది, స్వస్థత చేకూర్చే తియ్యనిమాట. చల్లని స్పర్శ అమృతంలాటి ఆర్ద్రత మాత్రమే కోరుకుంటాడు.

అలాగే ఇప్పుడు మంజులకు కావాల్సింది. అనురాగంతో ఆప్యాయతతో కూడుకున్న ఓ తియ్యని పలుకు మాత్రమే!

వసుంధర ఆమె వీపు పైచేయి వేసి రుద్దుతూ! 'చూడమ్మా మంజూ! నీవన్నీ తెలిసిన దానివి! కొన్ని వందల మంది విద్యార్థులకు విద్యామృతాన్ని పంచిపెడుతున్న నీవు ఇలా పసిపిల్లలా ఏడ్వటం బాగుండలేదు. మనిషికి బాధలు వుండటం సహజం. సంఘంలో నీకున్న విలువేమిటో తెలుసా? నీవొక లెక్చరర్‌వి! కావలసినంత డబ్బు, పలుకుబడి వున్నాయి! నీ విలువను నీవు గుర్తించుకోలేక బాధపడుతున్నావా?' అన్నది ఆమె నుదుటిపై లాస్యం చేస్తున్న ముంగురులను సవరిస్తూ...

'డబ్బుతో ఆప్యాయతను మమకారాన్ని కొనుక్కోగలమా మేడమ్!' అన్నది ఆవేశంగా...

సముద్రపు అలలు అవిరామంగా సాగిపోతునే వున్నాయి. చల్లని గాలికి మనసుకు కొంత సాంత్వన చేకూరుతున్నా ఏదో తెలియని మంట, ఆరాటం ఆమెను తొందర పెడుతున్నాయి.

'నీ బాధేమిటో చెప్పవా మంజూ! నేను నీ తల్లిలాంటి దానననుకోలేవా?, ఎందుకిలా సంశయిస్తావు?' అన్నది మంజుల దగ్గరకు జరిగి కూర్చుంటూ...

'మేడమ్! మీకన్న ఆప్తులు, శ్రేయోభిలాషులు నాకీ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. మీకు చెప్పుకొని వూరట చెందటమే నాకిప్పుడు మిగిలింది.

మంజుల చెప్పటం ప్రారంభించింది.

* * *

ఎప్పుడైనా ప్రపంచంలో స్వార్థం, స్వలాభం, స్వప్రయోజనం చూచుకొనే మనుషులే సుఖపడతారు మేడమ్! స్వార్థం లేకపోతే మనిషిలేడు. ముఖ్యంగా స్త్రీమరీ స్వార్థపరురాలు.

సరిగ్గా ఆరుసంవత్సరాలక్రితం నేను బెజవాడ లయోలా కాలేజీలో లెక్చరర్‌గా చేస్తున్న రోజులివి! యూనివర్సిటీ వాళ్లు యిచ్చిన డిగ్రీతో ఉద్యోగంచేస్తున్నానన్న మాటేగాని నాలో ఊహాశక్తి, భావనాశక్తి జీవితాన్నిగురించిన ఆలోచనలుగాని వుండేవి కావు.

అప్పట్లో నేనొకస్త్రీననిగాని, వివాహం చేసికోవాలన్న తలంపుగాని, ఆలోచనగాని నాలో లేవు. మామూలుగా పదిగంటలుదాటిన తర్వాత రంగన్న అరేంజ్ చేసిన భోజనం ముగించి కాలేజీకివెళ్లటం, ఆ రోజు సిలబస్‌ప్రకారం పాఠాలు క్లాసులవారికిచెప్పటం, సాయంకాలం యింటికి వచ్చి స్నానం భోజనం ముగించి, కొంత నోట్సు వ్రాసికొని ఆతర్వాత ఏవేవో పుస్తకాలు చదవటంలో మునిగిపోయి ఎప్పటికో నిద్రపోవటం నాకు బాగా అలవాటు.

ఆరోజు శుక్రవారం, తలంటిపోసికొని నాకిష్టమైన పాములాంటి తెల్లటి చారలతోవున్న ఆకుపచ్చని చీర, అదే కలరు బ్లవుజ్ వేసికొని నాలుగైదు గులాబీలు గుత్తిగాకట్టి తలలోపెట్టుకొని నా ప్రతిబింబాన్ని అద్దంలో ఐదారుసార్లు చూసుకొని నేను ఎంతగానో మురిసిపోయానా రోజు.

పైవేళకు రిక్షా కోటయ్య వీధిలో




## బ్లూసీల్ టాల్క్
హెక్సాక్లోరోఫీన్ కూడినది

## సాధారణ టాల్క్ ఇవ్వలేని హాయిని ఇస్తుంది...

## శరీరానికి చెమటవాసనను రానీయక రోజంతా నవనవలాడించే రక్ష







రక్ష: దీంట్లో చేరిన అమోఘమైన హెక్సాక్లోరోఫిన్, చెమటతో సూక్ష్మజీవుల విశ్లేషణంవల్లకల్గే శరీర దుర్గంధాన్ని నివారించి చర్మానికి రక్షనిస్తుంది....

హాయి: చర్మాన్ని పట్టులా మృదువుగా నున్నగా వుంచి మనోహరమైన సువాసనతో పరిమళింపచేస్తూ హాయినిస్తుంది!

గమనించండి. బ్లూ సీల్ టాల్క్—ఏ యితర టాల్క్ ఇవ్వని చర్మరక్షణ నిచ్చి మనస్సుకు హాయినిస్తుంది—అనే మాటను నిలబెట్టుకుంటుంది!

హెక్సాక్లోరోఫీన్ చేరిన
**బ్లూసీల్ టాల్క్**

చీస్‌బ్రో-పాండ్స్ వారి మరో విశిష్టమైన తయారి

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ లో స్థాపించబడినది)

# తప్పెవరిది?

కొట్టటం విన్పించగానే పుస్తకాలు, హేండ్ బేగ్‌తో వెళ్ళి రిక్షాలో కూర్చున్నాను. రిక్షా కాలేజీవైపు పోతోంది!

జయ్‌మని రొదచేసికొంటూ ఒక్క ఉదుటున నా రిక్షాకు గజందూరంలో ఓ స్కూటర్ సడన్‌గా ఆగిపోయింది. రిక్షా చక్రం ఒకటి ప్రక్కకు వంపు తిరిగింది. స్కూటర్‌మీద మనిషి ఎగిరి గంతేసి నట్లు స్కూటర్‌దిగి రిక్షావాడితో 'ఏయ్! నీకు విన్పించటంలేదా? హారన్ దిన్ని సార్లు మోగిస్తున్నా సైడ్ యివ్వకుండానే అలాగే పోనిస్తా మిటి?' అన్నాడతను అధికారాన్ని, కోపాన్ని కంఠంలో మేళవించేసి.

ఆ అపరిచిత కంఠధ్వని వీణలు మ్రోగి నట్లు విన్పించడంతోనే నేను కొంచెం తల బైటకుపెట్టి ఆవ్యక్తిని చూశాను. అంతే! ఏదో విద్యుత్తు నాలో ప్రవహించి నట్లయింది. పొడవుపాటి విగ్రహం. నీలం ప్యాంట్‌మీద తెల్లటి షర్టు. గట్టిగా పుచ్చులా కట్టిన టై. బిగువైన అంగ సౌష్ఠవంతో మెలమెలలాడుతున్న మనిషి! కళ్ళకు కూలింగ్‌గ్లాసెస్‌తో కన్నులపండు వుగా వున్నాడతను!

ఆసమయంలో అతనొక దేవతా మూర్తిగా నాముందు సాక్షాత్కరించినట్లే అనిపించింది క్షణకాలం. మాయిద్దరి కళ్ళూ కలిసికున్నాయి మనసులు ఏవేవో తెలియని భాషతో గుసగుసలాడుతున్నాయి. అతను నన్నే చూస్తున్నాడు. ఆవాడిచూపుల బాణాలకు తట్టుకోలేక నాచూపులను ప్రక్కకు మరల్చుకున్నాను. నాచేతులు కాళ్ళు ఏదో తప్పుచేసిన దానిలాగ కంపించటం మొదలు పెట్టాయి. హత్యచేసిన ఓ హంతకుని మనస్సులాగ నా మనస్సు కొట్టు మిట్టాడిపోయింది. నాలో ఏదో 'అద్భుత శక్తి' ప్రవహిస్తున్నట్లు మరల అంతలోనే ఏదో ఒకా లోకంలో దొరకని అందం ఆనందం అతని చూపులలో లభ్యమౌ తున్నట్లుగా అనుభూతిపొందాను.

అలా తృప్తిపొందటం, అలా అతనిని నేనుచూడటం తప్పా మేడమ్! వయస్సులో వున్న ప్రతిస్త్రీచేసే చేష్టలను నేనూచేశానేమో ననిపించింది అతన్ని చూచినప్పుడే నేను ప్రేమలోని మధురిమ ఏమిటో తెలిసికోగలిగాను.

ఆరోజంతా నామనస్సు అస్తవ్యస్తంగానే వుండిపోయింది. యాంత్రికంగానే పిల్లలకు పాఠాలు ఏమిచెప్పానో కూడా నాకు తెలియదు.

ప్రతివస్తువులోనూ అతని ప్రతిరూపమే! నిముష నిముషానికి ఆయన్ని గురించిన ఆలోచనలే నా తలలో కందిరీగల్లాగ రొద చేయసాగాయి. అతని ముగ్ధ మోహనరూపమే నన్ను వివశురాల్ని చేసింది. అబ్బ! అంతఅందం యీ ప్రపంచంలో ఎవ్వరికీ వుండదేమో ననిపించింది. బహుశ: ప్రేమంటే అదేనేమొ.

పైగ అతని గుండెల్లో దాక్కొని వున్న అతని మంచితనం నన్ను ముగ్ధురాల్ని చేసింది. కాని ఆనాటిచూపు, అప్పటి హృదయంవేరు ఆ వయస్సులో ప్రతిస్త్రీ కన్పించిన ప్రతివ్యక్తిని అందగాడు, మంచివాడు, సహృదయుడనే సహజంగా అనుకుంటుంది గాబోలు! నేనూ అలాగే అనుకున్నాను. నదిలోని లోతు ఒడ్డున వుంటే ఎలా తెలుస్తుంది? అతని మంచితనం అతనిలో పూర్తిగ లీనమైపోయినప్పుడు తెలిసి వచ్చింది!

ఆరోజు రాత్రి నాకు నిజంగా నిద్ర పట్టలేదు. అన్నీ ఆయన్నిగురించిన ఆలోచనలే! వాటికొక రూపంగాని, మొదలు తుదిగాని లేవు! అనంతప్రవాహంలా సాగిపోయాయి. ఆలోచనలు!

ఆరోజు అతను నాకు కన్పించడం ఓ వరమనుకున్నాను. తర్వాత అతన్ని గురించి నాకు తెలిసిన వివరాలివి. అతను డబ్బుతోపాటు పేరు ప్రఖ్యాతులు గడించిన ఓ డాక్టరని, అతనికి వివాహమైనదని, ఇద్దరుపిల్లలు కూడా వున్నారని! ఈ విషయాలన్నీ తెలిసికున్న తర్వాత నేను విధి చేత వలిగిపోయిన ఓ శాపగ్రస్తురాలి ననుకున్నాను. మనస్సు నెవరో సుత్తులతో కొడుతున్నట్లుగానే బాధపొందాను. అతని గుర్తించిన ఆలోచనలను, అతని ప్రేమైక మూర్తిని క్రమంగా మర్చిపోవటానికి ప్రయత్నించాను.

నిర్లిప్తంగా మూగగా నాలుగు మాసాలు గడిచిపోయినై. ఓ రోజు రాత్రి వున్నట్లుండి నా ఒళ్ళు పేలాలుగా పేలిపోవటం చూచి,

'అమ్మాయిగారూ! నాతో చెప్పలేదే! ఇంత జ్వరం కాస్తుంటే ఎలా వూరుకున్నారు.' అన్నాడు రంగన్న తాత నావంటిపై చేయివేసి చూస్తూ...

'ఇది మామూలు జ్వరమేలే తాతా! టెంపరేచర్ ఏమంతగా లేదులే' అన్నాను బాధగ నిజానికి జ్వరం చాల తీవ్రంగానే వున్నది.

'మీ రెప్పుడూ యింతేలే అమ్మాయిగారూ! గుండెల్లో మంటలు మండుతున్నా మీరు చెప్పరు' అని నాపైదుప్పటి కప్పి డాక్టరును పిలుచుకువస్తానని వెళ్ళిపోయాడు రంగన్నతాత.

ఓ అర్ధగంటను కాలం మింగివేసిన తర్వాత బైట స్కూటర్ హారన్‌మోత వినటంతో నేను చీర, దుప్పటి సర్దుకొని పడుకున్నాను.

బూట్లు టకటక లాడిస్తూ అతను నా గదిలోకి రావటంతో నన్నెవరో చెంపపై చాచి కొట్టినట్లయింది. అతనే, సందేహం లేదు. ఆ రోజు నేనుచూచిన వ్యక్తే! నాలో వెయ్యిబల్బులు వెలిగి ఆగిపోయాయి. నా హృదయాన్ని ఎవరో తట్టి లేపినట్లయింది. నేను జ్వరంతో బాధపడుతున్న మనిషిననే మర్చిపోయి నందన వనంలోని వనకన్యలా, పింఛంవిప్పిన నెమలిలా నా మనస్సు గంతులువేసి ఆగిపోయింది.

అతని చూపులు నాచూపులు మరోమారు కలిసికొన్నాయి. ఆ చూపులలోని వాడివేడి నేను భరించలేక ప్రక్కకు తిరిగాను.

'ఏమండీ! మీరు మిస్. మంజుల లెక్చరర్ కదూ!' అన్నాడు. ఆకంఠంలో కోయిలలు పలికాయి.

'అవునన్నట్లు తలవూపాను' అతనిచ్చే ధర్మామీటరును చేతిలోనికి తీసికొంటుంటే అతని వ్రేళ్ళు నా వ్రేళ్ళను తాకటంతో నాలో ఏవో భావనా తరంగాలు ప్రవహించినయ్. మరల నానుండి ధర్మామీట రందుకొని పరీక్షించి 'అబ్బ, టెంపరేచర్ చాలా వున్నదండీ! మీరు పూర్తిగా విశ్రాంతి తీసికోవాలని, స్టెతస్కోపుతో నన్ను పరీక్షించి కొన్ని మందులు వ్రాసి యిచ్చి మరల రేపు వస్తానంటూ అదో విధంగా నావైపు మరోమారు చూచి వెళ్ళిపోయారు.

ఆ చూపు నేనిప్పటికీ మర్చిపోలే

ఆ మాపుతో నాలో అణగారిపోయిన అనేకమైన ఆశలు కోర్కెలు పెల్లుబికిపోయాయి.

ఈ విధంగా సాగిన మా పరిచయం. ఇంతై అంతంతై 'తప్పకుండా నిన్ను వివాహం చేసికుంటాను'అని అతను అనటం వరకు వచ్చింది.

'అతను వివాహితుడని తెలిసికూడా నీవు అతనికి ఎందుకు లొంగిపోయావు?' అని మీరనవచ్చు. నిజమే! నేనెందుకు, ఏవిధంగా అతనికి లొంగిపోయానో నాకర్థం కాదు. నా స్వార్థంతో నేను సుఖపడాలనే వాంఛతో, అతనిని నావాడ్ని చేసికోవాలన్న పేరాశతో, అతనిలో అలౌకికమైన అద్భుతప్రేమను నేను జుర్రుకోవాలన్న కాంక్షతో నేను లొంగిపోయాను. దీనికి తోడు అతను అప్పుడప్పుడు నాతో 'మంజూ! నీవులేనిదే నేనులేను. నాడాక్టరీ వృత్తినికూడా సక్రమంగా నెరవేర్చలేనేమో ననిపిస్తుంది. ఏమైనా నీవు నాకు కావాలి! తప్పక నా భార్యను ఒప్పించి త్వరలోనే నిన్ను వివాహం చేసికుంటాను. నా భార్య ఒప్పుకోదని అనుమానిస్తున్నావా? ఆమె చాల యోగ్యురాలు! విశాలహృదయురాలు! నా సుఖంకన్న యీ ప్రపంచంలో ఆమెకు మరేమీ అక్కరలేదు. తప్పక ఆమె అంగీకరిస్తుంది!' అనే వారిమాటలు నాలో జీవంపోసి మరింతగ నాకలలకు బలాన్ని చేకూర్చాయి.

* * *

ఓ శుభ ముహూర్తాన మేమిరువురమూ గుళ్లో పెళ్లిచేసికొని అతని యింటికి వెళ్లాము. నాలో ఏదో భయం భీతి ఆవరించి నన్ను అదరగొట్టటం మొదలు పెట్టాయి. ఆమె నన్నెంతగానో చీదరించుకుంటుందని, అసహ్యించుకొంటుందని, వానామాటలు మాట్లాడుతుందని, నయవంచకినని, కపటినని దూషిస్తుందని ఏవేవో తలపోసిన నేను ఆమె నాపట్ల చూపిన ప్రేమకు, ఆదరణకు పూర్తిగ వివశురాల్ని అయిపోయాను. నా హృదయం ఆమెపట్ల పశ్చాత్తాపాగ్నితో దగ్ధమైపోయింది. దేవతామూర్తియైన ఈ స్త్రీకి నే నెలా ద్రోహంచేశాను? నేనొక స్త్రీ నేనా? పాటిస్త్రీకి అన్యాయంచేసి నేను సుకొనే దేమిటని?' అని ఎంతెంతగానో నిందించుకున్నాను.

అదేరోజు రాత్రి ఆమె పెళ్ళిలోని నీలం పట్టుచీర, [illegible] నెక్లెస్‌యిచ్చి కట్టుకో మని చెప్పి, నెక్లెస్ నాకంఠంలో పెట్టటం లాంటి పనులు చేస్తుంటే నేనొక పిచ్చిదానిలా 'అమ్మా! నీత్యాగం నేను భరించలేను' అని అరవాలని పించింది. స్త్రీ సమస్త భోగభాగ్యాలను తృణప్రాయంగా మరొక స్త్రీకి అర్పిస్తుందేగాని ప్రాణసఖుని యివ్వగలుగుతుందా అంటే యివ్వలేదు. అందుకే ఈమె దేవతామూర్తి అనుకొని ఆమెలోని దేవతకు లోలోనే అంజలి ఘటించాను. ఆమెను వేనోళ్ల పొగుడుకున్నాను. శ్లాఘించాను.

ఓ రోజు ఉదయాన్నే కాఫీలవి ముగించిన తర్వాత నేను జడ అల్లుకుంటూ 'ఏమండీ! టేబిల్‌మీద నాపెన్ను లేదే!' అన్నాను హాలులోకి వస్తున్న ఆమె నుద్దేశించి...

ఆమె సన్నగానవ్వుతూ 'ఇదిగో చెల్లీ! నన్ను ఏమండీ అని గౌరవంగా పిలవనక్కరలేదు. అలాఅంటే నాకేదో లాగ వుంటుంది. నన్నొక పరాయివ్యక్తిగా భావిస్తున్నావన్నమాట అలా పిలిస్తే నాకు కోపంవస్తుంది. మనలో మనకు ఈ మర్యాద లేమిటి?' అన్నది అల్లుకొనే నాజడను తన చేతిలోకి తీసికొని అల్లుతూ సన్నగా రహస్యంగా చెవిలో 'నన్ను అక్కా' అని పిలువు! తెలిసిందా?' అన్నది.

ఆమాటకు నేను నిజంగా మ్రాన్పడిపోయాను ఆమెకున్నంత విశాల హృదయం ప్రపంచంలో ఎవ్వరికీ వుండదేమో ననిపించింది. ఆమెలో వున్నంత మంచితనం మరెక్కడా ఎవ్వరిలో కన్పించదేమో ననిపించింది.

ఆరోజునుండి నేను ఆమెను 'అక్కయ్యా' అని పిలవటం ప్రారంభించాను.

మా ముగ్గురిమధ్య అంటే వారిమధ్య అక్కయ్యమధ్య—ఏవిధమైన పొరపొచ్చాలు లేకుండ ఎంతో హాయిగ ఆనందంగ కాలం సాగిపోయింది. ప్రపంచంలో నా అంత అదృష్టవంతురాలు మరెవ్వరూ లేరన్న గర్వంతో అహంకారమైన దర్పంలో నేను కాలం గడపసాగాను.

నేను వెళ్ళిన సంవత్సరంలోపునే నాకు గర్భం రావటంతో అక్కయ్యలో ఈర్ష్యను, స్వార్థాన్ని, పగను ప్రస్ఫుటంగ చూడగలిగాను. రానురాను ఆమె నాపట్ల ద్వేషంతో తిరస్కారభావంతో, చీదరింపుతో వ్యవహరించటం నేను గమనించకపోలేదు. వారునేనూ సాయంకాలం ఆరుబైట కూర్చొని కాలేజీకబుర్లూ — హాస్పిటల్‌లోని విశేషాలగురించి వర్ణించుకొంటున్నా నామాటలు పట్టించుకోకుండ నిర్లిప్తంగ పట్టనట్లుగవుండి పిల్లలచేత లేదా పని



[illegible]
నన్ను దంపవుకోత కోస్తూ వేస్తున్నాయి. ఆమెలో మార్పు అద్దంలోని ప్రతిబింబంలా కన్పిస్తుంది.

సాయంకాలం కాలేజీనుండి యింటికి వచ్చినతర్వాత 'అక్కా! ఈ పుస్తకం చదువు ఎంతో బాగున్నది' అన్నాను ఆనందంతో ఓ నవలచేత కందిస్తూ... ఆమాటలతో అక్కయ్యముఖంలోని రంగులు మారాయి. ఏంతో చిదరింపుగ తిరస్కార భావంగ ముఖం చిట్లించుకొని 'కాలేజీలో లెక్చరర్లుగా పనిచేసేవాళ్లు చదివితే అర్థమవుతాయి కాని నాకెలా అర్థమవుతాయి?' అని చరచరా వంటింటివైపు వెళ్లిపోయింది.

ఆమెలో ఊహించని ఈ మార్పుకు నేనెంతగానో నొచ్చుకున్నాను. నాలోనూ నానుతాను నైరాశ్యం బాగువ్వయేర్పడ సాగింది. పిల్లలనుకూడ నాతో చేరవగా వుండనివ్వకుండ జేసింది.

హాఠాత్తుగా జరిగిన ఈ పరిణామానికి కారణమేమిటో వారినడిగితే నాకు చెప్పకుండ మౌనంగ వుండిపోయారు. దాదాపు వారుకూడ నావిషయం పట్టి పట్టనట్లుగ, అంటీ అంటనట్లుగ తిరగటం మొదలుపెట్టారు. ఈమార్పు నాగుండెల్లో తుఫానులను లేపింది నేనింకా ఎటువంటి

# తప్పెవరిది?

దుర్భర పరిస్థితులను ఎదుర్కొనవలసి వస్తుందోనని ఆందోళన చెందాను.

నాకు పూర్తిగ నెలలునిండాయి. ఆరోజు అక్టోబరు వాల్గవతేది. ఆరోజు నా ఆశల కలలు ఫలించినరోజు నా జీవితానికి ఓ అర్థాన్ని ఆనందాన్ని యిచ్చినరోజు. నాకు పండంటికొడుకు పుట్టాడు. నాలో వెయ్యి వసంతాలు వెల్లివిరిసాయి. నా ఆనందానికి అవధులులేవు. ఏదో సాధించలేని విజయాన్ని సాధించినంతగా తృప్తిపొందాను.

అప్పటినుండీ అక్కయ్య దాదాపు నాతో ముభావంగ వుండటం ప్రారంభించింది. నా ఆశల ఫలమైన, నా ప్రేమకు ప్రతిఫలమైన బాబుకు 'కిషోర్' అని పేరు పెట్టుకున్నాను.

వారిమధ్య—నామధ్య—అక్కయ్య మధ్య కాలం ముభావంగ నిరాశగ జరిగిపోతూనే వుంది. అక్కయ్య నామీద చీటికిమాటికి చిదరించుకుంటుంది. పెదబాబు నా బాబుతో వూసులాడుకొంటుంటే బలవంతానా, పులిలా ఆమె బాబును లాక్కుపోతుంది. ఇదంతా గమనించిన నేను మూగగ యేడ్చుకుంటాను ఆమె మౌనం నన్ను నిలువునా దహించివేస్తుంది. దాదాపు నాకు కావలసిన సౌకర్యాలన్నీ పనిమనిషే







చూస్తుంది. మా యిద్దరిమధ్య వారు మౌనంగానే వుండిపోవటంతో నాలోమరింతగ అగ్నిజ్వాల బయలుదేరింది. అనుకోకుండానే ఆరుమాసాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

ఆరోజు కాలేజీకి సెలవుకావటంవలన నేను కాలేజీకి వెళ్లలేదు నాగదిలో బాబును పడుకోబెట్టుకుని ఏవేవో గతస్మృతులను నెమరువేసికొంటున్న సమయంలో 'మంజూ' అనే భీకరకంఠస్వరానికి అదిరిపడి గబగబ గదిలోనుండి బైటకువచ్చి అక్కయ్య ఆకారాన్ని చూచి ఆశ్చర్యపోయాను.

ఆమెలోని పౌరుషం మరగలా కక్కుతుంది. ఆవేశంతో కోపంతో ఆమె ఎద ఎగిసి ఎగిసిపడుతుంది. కళ్లు చింత నిప్పులా మండిపోతున్నాయి. జుట్టంతా విరబోసుకుని వికృతరూపం దాల్చిన వింత రాక్షసిలా వున్నదామె.

నాకు మతిపోయినంత పనయింది. ఏమి మాట్లాడాలో తోచక ఏదో ఒకటి అడగాలికదా అనేభావంతో 'ఏమిటక్కా ఎందు కలావున్నావు!' అన్నాను ఆమెదగ్గరకు వస్తూ...

'అక్కా! కుక్కా! నేసిన ద్రోహం చాలు! వెరజాణవే! ఈ యింట్లో నీవైనా వుండాలి! నేనైనాఉండాలి! తక్షణం నీవు యీయింట్లోనుండి వెళ్లిపోవాలి. నేనీరంపపుకోతను భరించలేను. నా భర్త—నీవు కులుకుతూవుంటే యింక నేను చూచి భరించలేను నాలో యింక ఆశక్తిలేదు, నీవు వెళ్లిపోవాలి! లేదా! నేను ఆత్మహత్యచేసికుంటాను నా వుసురు నీకు తప్పకుండ తగులుతుంది' గడగడ నాల్గుమాటలు అనేసి వెళ్లిపోయింది.

నా క్రింది భూమి కృంగిపోయినట్లు యింది. నేను నిర్మించుకున్న సౌధాలన్నీ కుప్పకూలిపోయాయి. ప్రకృతంతా స్తంభించి పోయినట్లనిపించింది. నేనెందుకో ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపడక అప్పట్లో అది సహజమేనేమో అనుకున్నాను.

ఆసంఘటన జరిగినదగ్గరినుండివారితో నేను దాదాపు మూగదానిలా ప్రవర్తిస్తుంటూ ప్రిన్సిపాల్ గారిని ప్రబతిమాలి, ఎన్నెన్నో కష్టనష్టాల కోర్చుకొని, ఎంతో ప్రయాసతో నేను విశాఖపట్నం ట్రాన్స్ ఫర్ చేయించుకొని నాబాబుతోసహా యిక్కడికి వచ్చేశాను.

మంజుల చెప్పటం ఆపింది!

మేడమ్! నేను మొదటినుండి నష్టజాతకురాలినే! నా తల్లిదండ్రు లెవ్వరో నాకు తెలియదు. కాలుజారిన ఓ కన్య సంతానాన్ని నేను శిశాలయంలో 'కేర్ కేర్' మని ఏడుస్తున్న నన్ను ఓ వర ప్రసాదంగా భావించి ఆండాళ్ళమ్మగారు నన్ను పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించారు. పైగా ఆమె తదనంతరం వున్నకొద్ది ఆస్తీ నాపేర వ్రాసి ఆండాళ్ళమ్మగారు కన్నుమూశారు.

జీవితంలో నేనెవ్వరివలన యింత వున్నతస్థితికి వచ్చానో, ఎవరిచేతి చలువ వలన యింతటి దానను కాగలిగానో ఆమెకూడ పోవటంతో నాకంతా శూన్యంగ కన్పించింది అయినా నన్ను నేను నిల దొక్కుకున్నాను మరల బ్రతుకుమీద ఆశను కల్పించుకున్నాను కేవలం నాబాబు కోసరం బ్రతుకుతున్నాను మేడమ్!

ఆనాడు నా తల్లిదండ్రు లెవ్వరో తెలియక నేను అనాధనైపోయాను తల్లి తండ్రి వుండికూడ నాబాబు యీనాడు ఓ కాన్వెంటులో గోప్యంగా పెంచబడుతున్నాడు సంఘం నాపై చిన్నచూపు చూచింది నన్ను హీనపరిచింది నాగురించి కాలేజీ స్టూడెంట్సు కథలు కథలుగా అల్లి చెప్పుకొంటున్నా విని సహించాను నాలో యింక సహనంలేదు మేడమ్!

నాకు అన్నీ వున్నాయి అన్నారు! ఈ వుద్యోగం, ఈ హోదా, ఈ అంతస్థు నాకివేమి అక్కరలేదు పరిపూర్ణమైన ప్రేమ, మనశ్శాంతి నాకు కావలసింది మేడమ్! వారు నన్ను మోసం చేశారు దగా చేశారు.'

మరల చెప్పటం ప్రారంభించింది.

'మామూలుగా ఆ రోజు నేను కాలేజీ నుండి వచ్చేసరికి నాకోసరం ఓ లెటర్ ఎదురు చూస్తున్నది పరిచయమైన దస్తూరీయైనా నాలో ఏదో భయం మొలకెత్తింది. వణికే చేతులతో గబగబ వుత్తరం చింపి చదివాను.

ప్రియమైన మంజులకు,

నీవు నేను హాస్పిటల్‌కు వెళ్లిపోయిన తర్వాత మీ అక్కతో ఘర్షణపడి వెళ్లిపోయావని తెలిసికొని బాధపొందాను. బహుశ నీవు వెళ్లటమే సముచిత మని పించింది నాకు ఎందుకంటే నీకు సంఘంలో విలువవున్నది. హోదావున్నది పైగ నీచేతిలో ఓ మంచి వుద్యోగంవున్నది నీ జీవితాంతం నీవు ఎలాగైన బ్రతకగలవు నా భార్యకు నేనుతప్ప ఎవ్వరూలేరు. నేను లేకపోతే ఆవిడ జీవించదు. ఆవిడకు నేను ద్రోహం చేశానని ఆలస్యంగ తెలిసికున్నందుకు చింతిస్తున్నాను నీ సమక్షంలో నేనుంటే ఆమె జీవించదు నా భార్య నాబిడ్డలు నాకు కాకుండపోతారు అనుక నీవు గతాన్ని మరిచిపోయి మరెవరినైనా వివాహం చేసికొని సుఖించు. నన్ను మన్నిస్తావు కదూ!

ఇట్లు
చంద్రశేఖరం.

ఆ వుత్తరం చదివి నేను ఎన్ని రోజులు ఏడ్చానో మీకెలాచెప్పను మేడమ్! నేను శిలనైపోయాను నాకు హృదయం లేదు. నేను మనిషినికాను నేను చచ్చిపోతే బాగుండునని బాధపడుతున్నాను కాని నా బాబుకోసరం బ్రతుకుతున్నాను.

మేడమ్! మీరే చెప్పండి!

పురుషుని ప్రేమ. అనురాగంలోపడి కన్ను మిన్ను కానకుండ, ముందు వెనుకలు ఆలోచించకుండ అతనికి నా సర్వసం అర్పించి అతనిలో ఐక్యమైపోవటం నాతప్పా? లేక అన్నెం పున్నెం ఎరుగని కన్యలో ఎన్నెన్నో ఆశలు రేకెత్తించి ఏవేవో వూహాసౌధాలు నిర్మించి వలపించి వాంఛించటం అతనితప్పా? లేక.




భర్త మరో స్త్రీని పెళ్లిచేసికున్నా సహించి, అందుకు ఆమె దీర్ఘ సౌమంగళీ ని ప్రేమగ ఆశీర్వదించి అమృతం చిలికించ మరల అంతలోనే ద్వేషించి దూషించి యింటినుండి గెంటివేయటం ఆమెది తప్పా? మా ముగ్గురిలో తప్పెవరిది మేడమ్?' అన్నది ఆమెను నిగ్గదీసి అడుగుతున్నట్లు ఆవేశంతో అరిచింది.

'పిచ్చిపిల్లా, ఎందుకలా ఆవేశపడతావ్! ఆవేశంతో చేసినపనులు అనర్థదాయకంగానే వుంటాయి నేను మీ ముగ్గురిదీ తప్పేనంటాను కాని సంఘం నీదే తప్పని దుమ్మెత్తి పోస్తుంది డాక్టరుగారి భార్యపై సానుభూతి చూపుతుంది. పైగ డాక్టరును, అతనికేం? అతను మగవాడు. అతను ఏంచేసినా చెల్లుతుంది?' అని లోకం సమర్థిస్తుంది. అంతేకాదు. భార్య వున్నదని తెలిసికూడ ఆమె వాళ్ళ పచ్చని సంసారంలో నిప్పు లెందుకు పోయాలి?' అని నిందిస్తుంది. ఇంకా యీ లోకం నీలాంటివారిపై, కాలుజారిన కన్యలపై సానుభూతిచూపే టంతగా యింకా ఎదగలేదమ్మా! మన సంఘం యింకా అంతపైకి రాలేదు.' అన్నది లాలింపు కంఠంలోనింపి 'అయితే వాడే తప్పంటారా మేడమ్!' అంటూ రెండు చేతులతో ముఖాన్ని కప్పుకొని కుళ్లి కుళ్లి యేడ్చింది మంజుల

ఆమెను ఓదార్చేశక్తి ఎవ్వరికీ లేదు. వసుంధర మేడమ్ అలాగే చూస్తూ వుండిపోయింది. అప్పటికే బీచ్‌లో పురుగు కూడ లేదు. ఎనిమిది గంటలు కావస్తుంది. కాటుకలాంటి చీకటిని పారద్రోలుతూ వీధులలో విద్యుద్దీపాలు దేదీప్యమానంగా పవిత్రస్త్రీ పాతివ్రత్యంలాగ వెలిగిపోతున్నాయి. చీర విదిలించుకొని పైకి లేస్తూ వసుంధర మేడమ్ మంజులను చేతితో పట్టుకొని కారువైపు నడిచింది

మంజుల వెక్కిళ్లు యింకా తగ్గలేదు. ఈదురుగాలి శరీరాన్ని తాకి చల్లగా అనిపించి చలి పుడుతున్నట్లుగా పమిటను నిండుగా కప్పుకుంది మంజుల,

ఇద్దరూ కారులో కూర్చున్నారు

సిమెంట్‌రోడ్డును కోసుకుంటూ కారు బాణంలా హాస్టల్ వైపు దూసుకుపోయింది. ●

# వారఫలం

## 4-7-1969 శుక్రవారం మొదలు 10-7-1969 గురువారం వరకు

**మేషం.** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా ప్రయోజనం ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారంమధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృషభం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. అధికవ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది

స్త్రీలకు— నూతన విషయాలను తెల్సుకొంటారు దైవకార్యాలు నెరవేరుతాయి.

**మిధునం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. నూతన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు బంధువులకు సహాయం చేస్తారు.

**సింహం** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు. వారంమధ్యలో వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. అలంకార వస్తువులు కొంటారు.

**కన్య:** ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో యితరులని విశేషంగా నమ్మడం తగదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**తుల:** వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. దైవకార్యాలు నెరవేరుతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు.

**వృశ్చికం:** వృత్తి వ్యాపారాల్లో మీకార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు—సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది.

**మకరం** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు—వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మీనం:** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. ప్రయాణాలోచనలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

—మహేష్ ●




# సిగ్నల్ మీ దంతాలను రక్షిస్తుంది ఇరవైనాలుగు గంటలూ



**సిగ్నల్‌లోని యెఱ్ఱ చారలు కలిగియున్నాయి, దంతక్షయ కారకాలైన సూక్ష్మ క్రిములను నివారించే 'హెక్సాక్లోరోఫిన్'**

మరియు, బ్రష్ చేరలేని స్థావరాలనుండి కూడా, దంతక్షయం కలిగించే సూక్ష్మ క్రిములను వేటాడి వెలువరిస్తుంది సిగ్నల్. దాని చురుకుదనంగల నురుగు, మీ నోటిని పరిశుభ్రంగా, తాజాగా ఉండేటట్లు చేస్తుంది. అన్నిటికంటె గొప్పదనం యేమంటే, పళ్లు తోముకున్న తరువాత, ఎన్నోగంటల వరకూ, మీ దంత ఆరోగ్యాన్ని కాపలా కాస్తుంది సిగ్నల్. మామూలు టూత్ పేస్టు ఇంతగా సహాయం చేయగలదా?




లింటాస్

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

సీరియల్



# బ్రతుకు బాట

పి. సత్యవతి

### జరిగిన కథ

మాధవరావు, రఘుపతి సుమిత్ర అన్నపూర్ణమ్మగారి సంతానం. తండ్రి చనిపోవడంతో కుటుంబభారమంతా మాధవరావుమీద పడుతుంది. మాధవరావు భార్య ఇందుమతి. కొడుకు విశ్వనాథం. సంసారాన్ని ఈదుకుంటూనే తమ్ముడు రఘుపతి, చెల్లెలు సుమిత్ర పెళ్ళిళ్ళు చెయ్యాలని సంబంధాలు చూస్తాడు. కాని, దూరంగా వుండి చదువుకుంటున్న రఘుపతి కులాంతర వివాహం చేసుకుంటున్నట్టు రాస్తాడు. దాంతో మాధవరావు కృంగిపోతాడు. మాధవరావు అంగీకారంతో సుమిత్ర కాలేజీలో చేరుతుంది. అక్కడే ఆమెకు కుముదినితో పరిచయమవుతుంది. తల్లి చావు బ్రతుకుల్లో వున్నప్పుడు భార్యతోసహా చూడ్డానికి వచ్చిన రఘుపతిని వెలివేసినట్టు చూస్తారు. అనుకోకుండ మాధవరావుకు సుబ్బలక్ష్మి తటస్థపడుతుంది. ఆమెకు సాయం చేయాలనిపిస్తుంది.

## 6

నిశ్చేష్టుడై నిలబడిపోయాడు మాధవరావు. ఆమె మనోభావాలు, వేదనలు అర్థం చేసుకున్నాక అతని మనస్సుకి [illegible] కలిగింది.

అప్పటినుంచి ఏదో మిషతో తను ఇంటికి [illegible]గా వచ్చేది సుబ్బులు.

[illegible] ఆశగా, దీనంగా, భయంగా చూస్తూ వెళ్ళేది. అప్పుడప్పుడూ ఏదైనా మాట్లాడేది. కళ్ళతోనే [illegible] [illegible].

తండ్రి మరణంతో అనేక బాధ్యతలు నెత్తినపడ్డాయి మాధవరావుకి. చెల్లెలు పెళ్ళి, ఉద్యోగం—అప్పులుతీర్చడం, ఆస్తులు అమ్మడం, వీటన్నిటితో అలసిపోయిన మాధవరావుకి అందరూ చెప్పిన సలహా యిది.

'తెనాలిలో మంచి సంబంధం వుంది మూడువేల కట్నం యిస్తారు. ఆ పిల్ల మంచిది—చక్కనిది. నువ్వా సంబంధం వొప్పుకో. వల్లూరులో కృష్ణమూర్తిగారి కొడుకు సత్యానందానికి మీ చెల్లెల్ని యిచ్చి ఆ కట్నం అతనికిచ్చి పెళ్ళి అయిందనిపించు. దానితో యిద్దరూ వొడ్డునపడతారు. ఇల్లుమాత్రం ఏ పరిస్థితుల్లోనూ అమ్మకు. అవతల తమ్ముడు చదువుకోవాలి—ఇంకా చెల్లెలు వుంది—'

బంధువులందరూ ఏకకంఠంతో చెప్పిన ఈ సలహా పాటించక తప్పలేదు మాధవరావుకి.

విమలకి పెళ్ళిచెయ్యక తప్పదు. తను సుబ్బుల్ని చేసుకుంటే విమలకి కట్నం ఎలా యివ్వగలడు ?

బంధువుల సలహా శరణ్యం అయింది. ఇందుమతిని పెళ్ళి చేసుకున్నాడు.

తన పెళ్ళిలో చిన్నబోయిన ముఖంతో వరండాలో స్తంభానికి ఆనుకు నిలబడ్డ సుబ్బులును తరువాత ఎప్పుడూ అతను చూడలేదు. వాళ్ళు ఇల్లుఖాళీచేసి వెళ్ళిపోయారు ఎక్కడికో.

తను చెయ్యలేనిపని రఘు చేయగలిగాడు. దానికి కారణం కేవలం ధైర్యమేకాదు. వాడికి ఉద్యోగంవుంది. మంచి ఉద్యోగం. ఎవరి సహాయమూ లేకుండా చదువుకుని పైకివెళ్ళాడు. చొరవవుంది. సహకరించే చెల్లెలువుంది. తను సుబ్బుల్నే చేసుకుని వుంటే విమల ఎంత గొడవచేసేదో !

అప్పటి కిప్పుడు మళ్ళీ సుబ్బులు కనిపించింది. ఆమెకి తను సాయం చెయ్యాలి. తప్పదు.

ఆడవాళ్ళు అనేక విషయాల్లో విశాల హృదయులుగా వుంటారుగానీ ఇలాంటి విషయాల్లో చాలా త్వరపడి ఆలోచించుకుని మనస్సు పాడుచేసుకుంటారు. ఇందుమతిని బాధపెట్టడం తన ధ్యేయంకాదు.

తెల్లవారి కాఫీ త్రాగుతూ భార్యతో అన్నాడు.

'మన దక్షిణంవైపుగది ఖాళీగానే వుంటోందికదా ! ఎవరికైనా అద్దెకిస్తే నీకు తోడుగా వుంటారు' అని.

'అవును — అత్తగారు పోయినప్పటినుంచీ ఆగది ఎక్కువ వాడడం లేదు — మంచివాళ్ళెవరైనా వస్తే యివ్వండి. తోడుగావుంటారు—' అన్నది ఇందుమతి.

వెంటనే సుబ్బలక్ష్మి మాట అతను చెప్పలేక పోయాడు. పైగా సుబ్బలక్ష్మికి ఆ గది అద్దెకివ్వడం తన లక్ష్యంకాదు. ఉచితంగా యివ్వాలని వుంది.

అప్పటికేమీ మాట్లాడలేదు అతను

ఆ సాయంత్రం ఆఫీసునుంచి రాగానే విశ్వనాథం అడిగాడు, 'నాన్నా రాత్రి నువ్వు బాబీవాళ్ళింటికి వెళ్ళావుటగా!' అని.

'అవును వర్షంలో తడుస్తూంటే లోపలికి పిలిచారు !'

'వాళ్ళమ్మగారు నీకు తెలుసటగా !'

'అవును—పూర్వం ఈ ప్రక్కన ఒక పెంకుటిల్లు వుండేది. అందులో వుండే వాళ్ళు—'

'వాళ్ళమ్మ చాలా మంచిది — పాపం బట్టలుకుట్టి బాబీని చదివిస్తోంది— వాళ్ళ ఇల్లు మరీ చిన్నది — అద్దెకూడా ఎక్కువే —' ఎవరూ అడక్కుండానే చెప్పుకుపోయాడు విశ్వనాథం.

'నాతో చెప్పలేదేమండీ !' అని అడగనే అడిగింది ఇందుమతి.

'చెప్పడాని కేముంది — వాళ్ళ అవస్థ

చూస్తే నాకు నవిల్సు యివ్వాలనిపించింది 'ఇంమా! ఏమంటావ్!' అని చటుక్కుని అనేశాడు మాధవరావు.

'అదా సంగతి! ఆమాట అంటే నేను కాదంటానుటండీ! అది మనస్సులో పెట్టుకుని రాత్రినుంచీ బాధపడుతున్నారా? భలే వారండీ మీరు!' అని నిముషంలో తేల్చేసింది ఇందుమతి.

ఆఫీసుకువెడుతూ సుబ్బలక్ష్మి ఇంటికి వెళ్ళాడు మర్నాడు.

వచ్చినపని చెప్పాడు క్లుప్తంగా— 'ఈవిధంగా మీ ఋణం తీర్చుకుంటున్నారా?, అని ప్రశ్నించింది సుబ్బలక్ష్మి.

'మా బ్రతుకు లెలాగో వెళ్ళిపోతున్నాయి. మళ్ళీ ఎందుకు మమ్మల్ని నవ్వులపాలు చేస్తారు! దయచేసి మాసంగతి వొదిలెయ్యండి—' అనికూడా అన్నది.

నిన్ను నవ్వులపాలు చేయడం నా ఆశయంకాదు సుబ్బులూ! మీ అబ్బాయిచదువు పూర్తిఅయ్యేవరకూ మాఇంట్లో వుండు. మా ఆవిడ చాలామంచిది—ఒకరి లాంటిది కాదు—' ప్రాధేయపడ్డాడు

'విశ్వం చాలా మంచివాడమ్మా! తెలివిగలవాడు వాడుకూడానూ! నాకు చాలా సాయం చేస్తాడు వెడదామమ్మా వాళ్ళింటికి! కాదనకు!' అని తల్లిని బ్రతిమిలాడాడు బాబి.

వాడికళ్ళల్లో దీనత్వాన్ని గుర్తించి కాబోలు 'సరే! అలాగే! కానీ నాకు మీరొక వాగ్దానం చేయాలి!' అన్నది కొడుకుని ఏదో పనిమీద అవతలకి పంపించి.

'తప్పకుండా! నేను ఆనాటి పరిస్థితులన్నీ నీకు వివరించి ఇప్పుడు చెప్పలేను. కానీ నిన్నిలా చూడవలసి వచ్చినందుకు చాలా బాధపడుతున్నాను నీ కేదైనా సాయం చెయ్యకపోతే నా మనస్సుకి శాంతివుండదు సుబ్బులూ!' అన్నాడు మాధవరావు ఆవేశంగా—

'మనఇద్దరి పరిచయాన్ని గురించి వివరాలేమీ అక్కడివారికి తెలియనివ్వనని మాట యివ్వండి—' అన్నది సుబ్బలక్ష్మి.

'నాకు ఆమాత్రం తెలియదా! నీ గౌరవ మర్యాదలకు హానికలిగే పక్షంలో నేను నిన్ను మాఇంటికి ఆహ్వానించకపోదును— సరే! రేపుమంచిది— గది ఖాళీ చేయించి వుంచుతాను. సాయంత్రం రండి—నీకు మాఇల్లు తెలుసుగా!'

'తెలియందేముంది! ఆ ఇంటిని అపరిచరాలినీ చూసి ఆరుతూన్నబాధ తిరిగి రగులుకొంటుంది అదేగా మీరు నామీద చూపుతున్న గౌరవం!' అనబోయింది. కానీ అనలేదు—

తృప్తినిండిన మనస్సుతో బయటకి వచ్చాడు మాధవరావు—

రఘుపతికి రాధతో పెళ్ళిఅని తెలిసినప్పటినుంచీ అతనిమనస్సు సుబ్బులును ఎన్నోసార్లు జ్ఞాపకం చేసుకున్నది. ఈమాత్రం ధైర్యం తానెందుకు చేయలేకపోయాడని పదేపదే ప్రశ్నించుకున్నాడు. అప్పటినుంచీ అతనిలో అశాంతి చెలరేగుతూనే వున్నది. ఈనాడతని మనస్సు కొంత వూరట చెందింది.

*　　　*　　　*

కాలేజినుంచివచ్చి, అలసటగా కుర్చీకి చేరబడిన సుమిత్రకి రెండు ఉత్తరాలు యిచ్చింది చిట్టి. ఒక కవరు కుముదిని



వ్రాసింది. హైదరాబాదునుంచి. ఇండియా ఇన్‌ల్యాండ్ కవరు. చిన్నన్నయ్య దగ్గరనుంచి. సుమిత్రకి.

ఈసరికి నీ పరీక్షలు మొదలైవుంటాయి—బాగా వ్రాస్తున్నా వనుకుంటాను. ఈ సారి ఉత్తరంలో నీకొక ముఖ్యమైన విషయం వ్రాయదలచాను. నా కారణంగా నీ పెళ్ళి ఆగిపోయినదని అందరూ అన్నందుకేమి, నాలో నీపైగల వాత్సల్యంకొలదీ నైతే నేమి నీకు నేను బి. ఏ. వరకూ చదువు చెప్పించాలనుకున్నాను అదేవిధంగా నీకు నెల నెలా, క్రమం తప్పకుండా డబ్బు పంపాను నీకు స్కాలర్‌షిప్ వచ్చిందని నువ్వు వ్రాసినా, అమ్మపోయాక ఆవిడ మందులు ఖర్చు తగ్గింది కదా ఇంత డబ్బెందుకని నువ్వుచెప్పినా వినక, నేను నెలకింత అని తగ్గించకుండా పంపాను.

ఈ నాలుగేళ్లల్లో నా సంసారంలో ముగ్గురు కొత్తసభ్యులు వచ్చారు. మొన్న మీ వదినెకి ఆపరేషన్ చేయించినప్పుడు చాలా డబ్బు ఖర్చుఅయింది. ఇక నేను కూడా నాపిల్లల భవిష్యత్తు ఆలోచించాలి కదా! ఏమంటావు! పైగా నేను పంపే డబ్బుతో నువ్వు అన్నయ్య సంసారానికి ఇన్నాళ్ళూ సాయంచేశావేగానీ కాస్త సొమ్మయినా దాచుకోలేదు — అన్నయ్యమాత్రం చిన్నివేలకో ఇన్సూరెన్సు కడుతున్నాడని తెలిసింది. మనుష్యుల్లో ఇన్నిమార్పు లొస్తున్నాయి కాబోలు! నీ పెళ్లిమాట ఆయన అసలే మర్చిపోయినట్లున్నాడు.

# బ్రతుకు బాట

నేను చెప్పదలచిం దేమిటంటే, నువ్వు ఎం. ఏ. చదివే పక్షంలో ఇక్కడికివచ్చి మా ఇంట్లోవుండు. లేకపోతే ఏం చెయ్యదలుచుకున్నావో వ్రాయి. ఇక నుంచీ మాత్రం నేను డబ్బు పంపలేను—

రఘుపతి.

ఈ ఉత్తరం చదివాక కుముదిని ఉత్తరం చదవాలనిపించలేదు సుమిత్రకి చిన్నన్నయ్య చాలాధైర్యంగా, తనమనస్సులో మాట సూటిగా చెప్పగలవ్యక్తి. అతను వ్రాసినదాంట్లో తప్పేమీలేదు. రేపటితో పరీక్షలు అయిపోతాయి. ఇక ఏమిటి చెయ్యడం? ఇన్నాళ్ళూ ఈ డిగ్రీ గమ్యస్థానంగా పెట్టుకుని నడిచింది. ఇప్పుడిక మరోగమ్యం వెతుక్కోవాలి.

పదిమంది ఆడపిల్లలూ ముచ్చటగా పట్టుపరికిణీలు కట్టుకుని సంక్రాంతి పేరంటం పిలవడానికొస్తే, చిన్నబోయిన ముఖంతో నిలబడిన సావిత్రికి కంచిపట్టు పరికిణీ కొనడం, సుబ్బలక్ష్మమ్మగారి మిషన్‌మీద కుట్టునేర్చుకుని 'మిషనుంటే నాబోటివాళ్ళుకూడా కాస్తోకూస్తో సంపాదించవచ్చు' నని అనేకమార్లు అనుకున్న వదినెకి వాయిదాల పద్ధతిమీద మిషన్ కొనివ్వడం. పిల్లల ఫీజులు కట్టడానికి డబ్బులేదని అన్నయ్య రెండుమూడుసార్లు అంటే తను వాళ్ళకి ఫీజులు కట్టుకోడానికి డబ్బివ్వడం, యివేగా తను వాళ్ళకి చేసిన సహాయాలు!

'నేను చేయగలిగినంతవరకూ చేశాను— ఇకనాపని ఐపోయింది— నీ యిష్టం— నీ బ్రతుకుబాట నువ్వే వేసుకో' అన్నాడు చిన్నన్నయ్య. పెద్దన్నయ్య తన భవిష్యత్తు మాట ఏనాడో మర్చిపోయాడు. ఇప్పుడాయనకు పిశ్శ్వం చదువునుగురించిన ఆలోచన తప్ప మరొకటి లేనేలేదు. మిషనుమీద గౌన్లూ, జాకెట్లూ కుట్టి రెడీమేడ్ షాపులకిపంపి నెలకి పాతికా ముప్పై సంపాదిస్తూ వదినె బంగారం గాజులు చేయించుకుందేగానీ, 'నీకు మీ చిన్నన్నయ్య పంపినడబ్బు నువ్వే దాచుకో సుమిత్రా! ఎందుకైనా వుంటుంది.' అని అనలేదు.

ఇప్పుడేం చెయ్యాలన్నా దగ్గర డబ్బు లేదు—

ఉత్తరం టేబిల్‌మీదపడేసి కుముదిని లేఖ విప్పింది సుమిత్ర.

డియర్ సుమిత్రా!

పరీక్షలు బాగా వ్రాశావనుకుంటాను నిన్నుచూసి మూడేళ్ళు నిండాయి. ఇంకెన్నాళ్ళు కనపడకుండా వుంటావు— ఈ సెలవులకి తప్పకుండా ఇక్కడికి రావలసింది. నీతో చాలా చెప్పాలనివుంది. ఇక్కడ ఎంతోమంది స్నేహం అయ్యారు. కానీ నిన్ను మరపించగల వాళ్లెవరూలేరు. ఈసారి నువ్వు రాకపోతే నాకు చాలాకోపం వస్తుంది. హైదరాబాద్ చూడనిదానివి నువ్వొకతివే! నాకోసం, వూరు చూడడం కోసం తప్పకరావాలి.

కుముదిని.

ఏడాది స్నేహం తామిద్దర్నీ ఎంత గట్టిగా బంధించివేసిందో తలుచుకుంటే ఆశ్చర్యం అనిపించింది సుమిత్రకి.ఆరోజులు జ్ఞాపకం వచ్చాయి' అయిదు నిమిషాలు మెదడు హుషారుతో నిండిపోయింది. తరువాత మళ్లీ చిన్నన్నయ్య ఉత్తరం జ్ఞాపకం వచ్చింది:

అప్పట్లో అమ్మ పోరు భరించలేక పెద్దన్నయ్య సంబంధాలకోసం తిరిగాడు. తను చదువులో చేరడంతో పెళ్లి ప్రసక్తి అవేదే తెర వెనక్కి పోయింది. ఇప్పుడిక ఆ ప్రశ్నే లేదు. ఉన్నదల్లా రెండే మార్గాలు. చిన్నన్నయ్య దగ్గరకు వెళ్లి చదువుకోడం. ఇక్కడే వుండి ఉద్యోగం చూసుకోడం. ఇన్నాళ్ళూ తనకోసం





అన్నయ్య చాలా డబ్బు పంపాడు. ఇంకా అతన్ని కష్టపెట్టడం తనకి ధర్మం కాదు కనుక ఏదైనా ఉద్యోగానికి ప్రయత్నం చేసుకోడమే మంచిదని నిశ్చయించుకుంది సుమిత్ర.

టైప్‌రైటింగ్, షార్ట్‌హ్యాండ్ రెండూ ప్యాసయింది గనుక ఉద్యోగం దొరకడం కష్టమేమీ కాదు.

పరీక్షలు వ్రాసి యింటికి వచ్చాక పెద్దన్న అడిగాడు, 'పరీక్షలన్నీ అయిపోయాయి కదూ! బాగానే వ్రాశావా?' అని

విశ్వం పి.యు.సి వ్రాస్తున్నాడు బాగానే చదివాడు. ఫ్లాసు తప్పదని ఖచ్చితంగా చెబుతున్నాడు. సావిత్రి ఫిఫ్త్‌ఫారం పరీక్షలు రేపో ఎల్లుండో మొదలౌతాయి.

బాగా వ్రాశావా అని అడిగాడేకానీ, తరువాత ఏం చేస్తావని అతడు అడగలేదు. ఈ నాలుగేళ్లలో మాధవరావులో వచ్చినమార్పు స్పష్టంగా గ్రహించింది సుమిత్ర. తల్లి బ్రతికివుండగా అతని హృదయంలోవుండే బలహీనతలు యిప్పుడు లేవు. ఇప్పుడతని ధ్యేయమల్లా ఒకటే. తన కొడుకుని తనలాగా గుమాస్తాని చెయ్యకూడదు. వాడు తిండికీ బట్టకూ లోటులేకుండా బ్రతకాలి. అంతేకాదు. తన కొడుక్కి తీసుకున్న కట్నంతో కూతురికి పెళ్లి చెయ్యాలన్న లెంకె పెట్టుకోడు. కూతురికి విడిగా కట్నంయిచ్చి పెళ్లైనా చెయ్యాలి లేదా చదివించాలి. ఈ రెండు ధ్యేయాలకోసం అతను శ్రమిస్తున్నాడు.

'నేను రేపు విశాఖ వెళ్లి చిన్నన్నయ్యను చూసి అటునుంచే హైదరాబాద్ వెళ్తాను అన్నయ్యా! కుముదిని చాలాసార్లు వ్రాసింది నన్ను రమ్మని' అని మాధవరావుతో చెప్పి ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకుంది. సేవింగ్స్ బ్యాంక్‌లో మిగిలిన ఒకే ఒక్క వందరూపాయలు డ్రా చేసుకున్నది. అదే ఇప్పుడు తనకి మిగిలిన డబ్బు. దాంతోనే రెండుఊళ్లు తిరగాలి. పొదుపుగా ప్రయాణాలు చెయ్యాలి

రిక్షా ఎక్కబోతూ వుండగా – ఇందుమతివచ్చి వంద రూపాయలు చేతిలోపెట్టి 'దేనికైనా కావాలంటే దగ్గరవుంటుంది! వుంచుకో సుమిత్రా!' అన్న ... ప్రేమ నిండిన కళ్లతో చూసి

'నా కెందుకు వదినా? ...

డబ్బు! వద్దంటే వుంచుకో!' అన్నది సుమిత్ర అయోమయంగా చూస్తూ, ఏం మాట్లాడాలో తెలియక.

'నీ దగ్గర ఎంత డబ్బుందో నాకు తెలీదా సుమిత్రా! నాకు నువ్వెంత సహాయం చేశావో! నీకు నేనీమాత్రం చెయ్యలేనా? తీసుకో! అవసరం వుంటుంది' అని బలవంతంగా చేతిలో పెట్టింది.

'త్వరలో వచ్చేస్తాను వదినా?' అని మాత్రం అన్నది సుమిత్ర.

ఆమెకి తెలియకుండనే కంఠంలో ఆర్ద్రత నిండిపోయింది.

'నాకు పిల్లలెంతో నువ్వూ అంతే సుమిత్రా! నేనెప్పుడూ నీ శ్రేయస్సు కోరుతూనే వుంటాను – నువ్వెందుకో చాలా బాధపడుతున్నావు వారం రోజులుగా– నేను అర్థం చేసుకున్నాను–నువ్వు చిన్నప్పటినుంచీ నా దగ్గరే పెరిగావు – ధైర్యంగా తిరిగిరా సుమిత్రా! కష్టమో సుఖమో అందరం ఒకచోటే బ్రతుకు పంచుకుందాం –' అన్నది ఇందుమతి ఆవేశంగా. అలా అన్నప్పుడు ఆమె కళ్ళల్లో తిరిగిన నీటిని చూస్తూ కూర్చుండి

# బ్రతుకు బాట

పోయింది సుమిత్ర.

రిక్షా కదిలి వేగం అందుకున్నది.

'వెళ్ళగానే ఉత్తరం వ్రాయి చిన్నత్తా! మర్చిపోకు!' అని చాలాసార్లు గుర్తు చేశాడు విశ్వం.

తన భవిష్యత్తును వెతుక్కుంటూ వెళ్తూన్న ప్రయాణంయిది. అనుకుంది సుమిత్ర. తన క్వాలిఫికేషన్లకి ఏదోఒక ఉద్యోగం తప్పకుండా దొరికి తీరుతుందనే ధైర్యంవుంది. ఈ ప్రయాణంలో ఏదో ఒకటి సాధించుకురావాలి అని గట్టిగా అనుకుంది. రైలుచక్రాల చప్పుడుకూడా అలాగే ధ్వనించింది 'విజయీభవ!' అన్నట్లు.

యౌవనం ఆమెలో వైవాహిక జీవితం కావాలనే తీయని కోరికలను రేపడం లేదు జీవితంలో తనకి తానుగా స్థిరపడాలనే ఆకాంక్ష ఒక్కటే వున్నది.

'ఏం సుమిత్రా! వచ్చేశావా,' అని స్టేషన్లో రాధ పలకరించినప్పుడు, 'అవును వదినా! నిన్ను చూడాలని, మీతో కలిసి ఒక వారం రోజులైనా వుండాలని ఎప్పటినుంచో అనుకుంటున్నాను. అందుకే వొచ్చాను! పిల్లలేరి!' అంటూ ప్లాట్ఫారం అంతా వెతికింది సుమిత్ర.

'వారమేమిటి? నువ్వు మా దగ్గర వుండి ఎం.ఏ. చదువుకోకూడదూ! నువ్వు వస్తావని ఎదురుచూస్తున్నాం' అన్నది రాధ గబగబా.

'ఇంటికి వెళ్ళి మాట్లాడుకుందాం వదినా!' అని సమాధానపరిచింది సుమిత్ర.

'ఇక్కడ వుండకూడదూ సుమిత్రా!' అన్నాడు రఘుపతి, సుమిత్ర వెళ్ళేరోజున.

'నువ్విప్పటికే చాలా కష్టపడ్డావన్నయ్యా! ఇంకా నిన్ను శ్రమపెట్టడం ధర్మంకాదు. చదువుకి అంతేం వుంది! నేను ఇక ఉద్యోగం చెయ్యదలుచుకున్నాను. నీకు వీలుంటే సహాయం చెయ్యి' అన్నది సుమిత్ర స్థిరంగా, ఆత్మవిశ్వాసం నిండిన కంఠంతో.

'ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో జీవితాన్ని ఎదుర్కొనేవాళ్ళంటే నాకు చాలా యిష్టం చెల్లాయ్! నేనెలా ఈ స్థితికి వచ్చానో నీకు తెలుసుగా! నువ్వూ అలాగే కష్టపడి, సంఘంలో గౌరవనీయమైన వ్యక్తిగా స్థానం సంపాదించుకో! ఇదే నా కోరిక!' అన్నాడు రఘుపతి.

ముదురునీలం జరీ అంచున్న లేతనీలం పట్టుచీరె, ముదురునీలం జాకెట్టూ, బుట్టనిండా పళ్ళూ యిచ్చి రైలెక్కించింది రాధ.

'విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్' అన్నది

'మళ్ళీ బెజవాడలో దిగవుగా!' అంటూ హైదరాబాద్‌కి టికెట్ కొనిచ్చాడు రఘుపతి.

'నా సంసారం, దానికి తగ్గ ఖర్చూ చూశావుగా! నామీదేం కోపం పెట్టుకోవని నమ్ముతున్నాను' అన్నాడు చివరికి తల వంచుకుని.

'ఇది మరీ బావుంది! నీమీద నాకేం కోపం అన్నయ్యా! నువ్వంటే చాలా గౌరవం' అన్నది సుమిత్ర ఆప్యాయత నిండిన అశ్రుబిందువులు తుడుచుకుంటూ.

ఆత్మబంధువులు అనబడేవారు దూషించినా కన్నీరు వస్తుంది. హృదయాన్ని తాకేటట్లు చల్లగా మాట్లాడినా కన్నీరువస్తుంది. అందుకే కన్నీటికి అంత విలువ!



రైలు కదిలింది. రైలుతోపాటు చిన్నన్నయ్య జీవితం కళ్ళకి కట్టింది.

మొదటినుంచీ వాడిజీవితమంతా పట్టుదలతోనే గడిచింది. ఎంత పట్టుదలో అంత జాలిగలవాడు వాడు. అందుకే కాలేజి ఫీజులకోసం అన్నయ్యని అడగకుండా ట్యూషన్లు కుదుర్చుకునేవాడు.

చిన్న చిన్న పార్ట్ టైం ఉద్యోగాలు చేసేవాడు. కొట్లల్లో ఎకౌంట్స్ చూసి పెట్టేవాడు. ఇవ్వన్నీ ఇలావుంచి సినిమాలూ చూసేవాడు, పుస్తకాలూ చదివేవాడు. వదినెకి కాఫీ చేసిచ్చేవాడు, అమ్మకి పప్పు రుబ్బిపెట్టేవాడు. తనకి నోట్సులు వ్రాసిచ్చేవాడు. వాడి ఉత్సాహంచూస్తే తనకే ఆశ్చర్యం కలుగుతూ వుండేది.

'మనిషికి ఉత్సాహం శక్తినిస్తుంది! బ్రతకాలి, ఇంకా బాగా బ్రతకాలి అన్న ఆశ బలాన్ని యిస్తుంది ఈ రెండింటి సాయంతో అనేకమంది జీవితంలో ఔన్నత్యాన్ని సాధించ గలుగుతున్నారు' అనేవాడు. ఉపన్యాసాలు యివ్వడం చాలా సరదా!

ఎం. ఎస్సి చదవడానికి వాడు బయలుదేరిన రోజున అమ్మ దిగులుపడిపోయి అడిగింది. 'వున్నవూరుగనుక ఇంతవరకూ లాక్కొచ్చావు నాయనా! అంతచదువు ఎలా చదవగలవు! నీకు అన్నయ్య అంతడబ్బు ఎలా పంపుతాడు! ఏదైనా ఉద్యోగం చూసుకోకూడదూ?' అని బ్రతిమిలాడింది

'సంకల్పబలంతో ఏదైనా సాధించగలననే ధైర్యం నాకుంది. నేనెలాగో చదవగలనులే అమ్మా! నీకేం బెంగవద్దు—' అని చెప్పి వెళ్ళిపోయాడు రఘుపతి.

అలాగే వాడిచదువు అయిపోయింది. ఉద్యోగము వచ్చింది. సహధర్మచారిణి కూడా దొరికింది. పాలూ, తేనె సంపాదించుకుని కలబోసుకుని తాగేస్తున్నాడు. అదృష్టవంతుడు.

సుమిత్ర నవ్వుకుంది. తనుగాని అసూయపడడంలేదుకదా చిన్నన్నయ్యనిచూసి! అవును అదృష్టవంతులను చూసి అసూయపడడం మాత్రం అసహజమేం కాదే!

(ఇంకా ఉంది)




ఇది ఒక నిశ్శేషజీవి. కోట్లాది సంవత్సరాల క్రితం భూగోళంమీద—సముద్రాలలో — జీవించిన సరీసృపం. దీని ప్రాముఖ్యం ఏమంటే సరీసృపమైనా పూర్తి జలజీవనానికి—ఇప్పటి కొన్ని సముద్ర తాబేళ్లలా—అలవాటు పడ్డది. అయితే వీటి పరిమాణం సుమారు 40 అడుగుల వరకూ ఉండేది. వీటి ఆకృతి చిత్రంగా ఉండేది. తల చిన్నది, మెడ పొడవుగా, అన్నివక్కలా ఊగగలిగి ఉండేది. చేతులు కాళ్ళు—అంగాలు — తెడ్లలా ఏర్పడ్డాయి. తోక పొడవుగా ఉండేది. వీటి సహాయంతో సముద్రవిహారం చేస్తూ చేపలని, తదితర జీవుల్ని తింటూ ఉండేదని మన శాస్త్రీయుల ఊహాగానం. మెడ పొడవుగా ఉండడం వల్ల, సునాయాసంగా కదలగల్గడం వల్ల అన్నిదిక్కులకు పోనిచ్చి ఆహారాన్ని సేకరించుకొనేది. అయినా పాపం సంతానోత్పత్తి నేలమీదనే జరిగిఉండాలి. నీటిలో గ్రుడ్లు పెట్ట లేదు కనక! ఇదీ మన ఊహాగానమనుకోండి.

ఇవి డైనోసార్లు అని పిలవబడే భయంకర సరీసృప విభాగానికి చెందుతాయి. ఇవన్నీ భూమిమీద 7 కోట్ల సంవత్సరాల కాలం క్రితం వరకు ఉండేవి వాటి ప్రారంభం సుమారు 20 కోట్ల సం॥ క్రింద. ఆ 13 కోట్ల సంవత్సరాలకాలం భూమిని ఏలిన సామ్రాజ్య సరీసృప జీవులుఅవి. వాటి ధాటికి మరే ఇతర వర్గజీవులు నిలవ గలిగేవి కావు. అదృష్టంకొద్దీ మనం అప్పటికి లేము. మనసన్య జీవుల పరిణామం ఇంకా చెప్పుకోదగినంతగా జరగలేదు. 7 కోట్ల సంవత్సరాల క్రితం ఆశ్చర్యంగా అవి నిశ్శేషమయిపోయాకనే మన పరిణామసృష్టి జరిగింది. మనకు వాటి బెడద లేకపోయింది. అలాపోగా మిగిలిన సరీసృపాలే తొండలు, బల్లులు, మొసళ్ళు, పాములు, తాబేళ్ళు మొదలైనవి. అప్పటి సరీసృపాల కాలిగోటికైనా ఇవి పోలవు!

—ఇమ్మిడి కోనేటిరావు.



# ముగింపు

విజయ.మారుతి

'లతా! ఓ లతా!' అంటూ బూట్లు టక టక శబ్దంచేస్తూ హాల్లోకి అడుగు పెట్టాడు రవి.

సావిట్లో సోఫాలో కూర్చుని ఏదో నవల చదువుతున్న లత మాట్లాడలేదు.

ఒకసారి లత వంక చూసి 'వూ'అంటూ దీర్ఘంతీస్తూ ఆమెకు ఎదురుగా వున్న సోఫాలో కూర్చొని బూట్లు విప్పసాగాడు.

'అది సరే నేను వెళ్ళేప్పుడు బాగానే వున్నావు. వచ్చేసరికి ఈ చెముడేమిటి?' అంటూ ఆశ్చర్యంగా నోరు తెరిచాడు.

వచ్చిన నవ్వును పెదిమలమీదకు రానీ కుండా, కనుబొమలు అందంగా ముడి వేస్తూ 'ఇక్కడ ఎవరికీ చెముడు లేదు కానీండి, ప్రొద్దున నీవు వెళ్ళేప్పుడు బాగానే వున్నావు, వచ్చేప్పుడు 'మతిమరుపు' వెంటబెట్టుకొచ్చావా?' అంది వెక్కిరుస్తూ.

'నాకు మతిమరుపుంటే, నీకు పిచ్చెక్కిందన్నమాటే!'

'నాకు చెముడుంటే నీకూ అదే!' అంది పుస్తకం చాటునుంచి.

'ఏయ్! అమ్మాయ్! ఏమిటా పొగరు?' అంటూ సోఫాలోంచి లేచి లత చేతిలోని పుస్తకం లాగి అవతల పారేశాడు.

'ఏయ్ అబ్బాయ్! ఏమిటీ!' అంటూ అతనివంక చూసి కళ్ళు పెద్దవిచేసి తనను పట్టుకోజూసిన రవీంద్రను చూసి ఒక్కసారి గుమ్మం దగ్గరకి పరుగెత్తి చిలిపిగా నవ్వుతూ 'ఏమిటీ పొగరు?' అంటూ లోపలికి పరుగుదీసింది. లత పొడుగాటి జడ అందంగా వూగులాడింది. ఆమె వంక అలాగే చూస్తూ నిల్చున్న రవి మళ్ళీ సోఫాలో చతికిలబడి రెండు కాళ్ళు ఎదురు వేసి టేబిల్ మీద పేపరు చేతిలోకి తీసికొన్నాడు.

'బావా! కాఫీ!' అన్న పిలుపుకి పేపరు అవతల పారేసి లత వేపు తిరిగాడు.

ఆరోజు శుక్రవారం కాబోలు తలంటి పోసుకొన్న జుట్టు ముఖంమీద పడుతోంది. కళ్ళనిండా కాటుకే. నుదుట ఎర్రని బొట్టుతో చాలా అందంగా కన్పించింది లత. అల్లాగే ఆమెవంక చూస్తూ కప్పు నోటిదగ్గర పెట్టుకొని 'థూ' అంటూ ఒక్కసారి వుమ్మేసి ఒక్క ఎగురు ఎగిరి ఆ కప్పును టేబిల్‌మీద పడేసి—

'అబ్బ! పచ్చికారం! అమ్మ చంపేశేవే!' అంటూ అటూ ఇటూ తిరగడం మొదలుపెట్టాడు నెత్తి నోరు కొట్టుకొంటూ.

అతన్నిచూసి పకపక నవ్వి 'అయ్యిందా పెళ్ళి? నాకు చెముడా?' అంది.

'అమ్మా సుబ్బమ్మా! ముందుకాసిని మంచినీళ్ళతే. తరువాత పళ్ళయికిలిద్దువుగాని' అన్నాడు వుక్రోషం పట్టలేక.

'నేను సుబ్బమ్మనా' అంది.

'నువ్వు సుబ్బమ్మకాదూ. లతవి..పును

అతనే' అంటూ ముక్కు చీదాడు.

రడీగా వుంచుకున్న పంచదార, చెంబుడు నీళ్ళు తీసికొచ్చి అతని నోట్లో పంచదారపోసి చెంబు అతనిచేతి కిచ్చింది. ఆ నీళ్ళు గటగట త్రాగి 'హమ్మయ్య చంపేశావుగదే అంటూ గొంతు నిమురుకో బోగాడు లత అతనిచేతిలోని చెంబుతీసికొని వెళ్ళబోయింది.

'కాఫీ' అన్నాడు నీరసంగా చేయిపట్టుకొని.

'తెస్తా వుండు' అంటూ అతని చేతిలోంచి తనచేయి తీసికొంది.

లత కాఫీతెచ్చి అతనికిచ్చింది. ఆమె వంక చూడకుండానే కాఫీ నోటిదగ్గర పెట్టుకోబోయి ఆగి 'లతా సిప్పీ! సిప్పీ! నువ్వుకూడా త్రాగు' అంటూ సాసర్లో పోసియిచ్చాడు.

'ఏం! మళ్ళా ఏమన్నా కలిపానని అనుమానమా! ఏది ఆ కాఫి యిటు ఇయ్యి' అంటూ రవిచేతిలోని కప్పును తీసికొని సోఫాలో స్థిమితంగా కూర్చుని తాగేస్తోంది.

ఆమెవంక అలాగే చూస్తూ కూర్చున్నాడు రవి ఏమి చెయ్యలేక.

'బావా! నువ్వు పారేసిన పుస్తకం కాస్త యిస్తావా! పూర్తిచేయాలి' అంది తాపీగా.

రవికి వళ్ళు మండిపోయింది గబుక్కున లేచి ముఖంమీదపడ్డ జుట్టును వెనక్కి తీసికొన్నాడు. టేబిల్ దగ్గరున్న బూట్లను తొడుక్కొని బయటకి వెళ్ళబోతుంటే 'బావా! ఆగు కాఫీతాగివెళ్ళు' అంటూ అతనిచేయి పట్టుకొని ఆపింది.

'నువ్విచ్చేదేమిటి? హాయిగా బయటికి వెళ్ళితే కావల్సినంత మంది ఇస్తారు' అంటూ ఆమెచేయి విదిల్చుకుంటూ వెళ్ళిపోయాడు.

లత అల్లాగే నిలబడింది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇంక ఆగలేమంటూ బుగ్గలమీదకు జారిపోయాయి. అయినా తనేంచేసింది తనే ఎప్పుడూ ఏడిపిస్తాడు. నేను ఈరోజునేగా 'ఇల్లాచేసింది. అయినా, ఈరోజిలా అనకండాపుంటే బాగుండేది 'అక్కడ తాగుతాడోలేదో!' అంటూ తననితనే తిట్టుకుంది.

'లత! బావ వచ్చాడా?' అన్న తల్లి పిలుపుకి గబుక్కున కళ్ళు తుడుచుకొని.

'వచ్చి వెళ్ళాడమ్మా' అంది.

'అయితే ఒక యుద్ధకాండ ముగిసిందన్నమాట. రేపు పెళ్ళయితే చూడాలి' అందావిడ నవ్వుతూ.

'తను నన్ను అనవచ్చుగాని నేనంటే వస్తుంది కోపం పెద్ద' అంది కోపంగా.

'ఆ! ఏదో తమాషాకి అన్నాడనుకో! దీనికింత గొడవ ఎందుకు? నేను గుడికి వెళ్ళుతున్నా తలుపు వేసికో' అంటూ ఆవిడ చెంగు బుజం నిండుగా కప్పుకుంటూ వెళ్ళిపోయింది.

రవికోసం వాకిట్లో నుంచున్నది కాసేపటికి వీధిలోని లైట్లు ఒక్కసారి వెలిగాయి లత గబుక్కున దణ్ణం పెట్టుకొని దేవుడి పటం చూసింది. లోపలికి వెళ్ళి హాల్లో లైటువేసి వచ్చింది ఎక్కడా రవి జాడ లేదు. లత కంగారుపడిపోయింది. 'అనవసరంగా ఈ రోజు నా మూలంగా ఇల్లా అయ్యింది' అంటూ తన్ని తానే తిట్టుకొంది.

దూరంగా రవి ఆకారం కనబడేసరికి చల్లబడిపోయిన కోపం ఒక్కసారి తిరిగి ఆవిడలో ప్రవేశించి ముఖం అంతా ఎర్రబడసాగింది. అతనికోసం తను ఎదురు చూసినట్లు వుండకూడదని గబగబ గదిలోకి వచ్చి పక్కమీద వాలిపోయింది.

'లతా! లతా!' అంటూ అన్ని గదులు వెతికి లత దగ్గరకు వచ్చాడు.

'లతా' అంటూ మంచం దగ్గర వున్న కుర్చీ దగ్గరకి జరిపి కూర్చున్నాడు.

లత మాట్లాడలేదు.

'లతా!' అంటూ ఆమె తల మీద చేయి వేశాడు.

ఆ చేతిని విసరికొట్టి లేచి కూర్చుంది. ఆమె ముఖం చూస్తూనే తెలుస్తోంది. ఏడ్చినట్లు ఇంకా బుగ్గలమీద తడి అలానే వుంది.

'లతా కాఫీ యివ్వు' అన్నాడు ఆమె వంక చూస్తూ.

'ఏ హోటలువాడో యిస్తాడుగా'

'కాని నీ చేతితో తాగినట్లు వుంటుందా?'

'మరి నువ్వు కాఫీ తాగలేదా?' అంది మంచం దిగుతూ. ఆమె ముఖంలోని ఎరుపు రంగు తరగిపోయింది.

...'ఉహూ!' అంటూ తలూపి 'అసలు నేనెలా తాగుతా అనుకున్నావో' అన్నాడు కళ్ళు చిట్లించి.

'అయితే ఒక్కనిమిషం వెయిట్‌చెయ్యి. తెస్తా' అంది.

ఈ 'లత' తనది అనుకుంటె రవి హృదయం చెప్పలేనంత గర్విస్తుంది. ఈ ఏడులో తన పరీక్షలై పోతాయి. అత్తయ్య ఈ పెళ్ళికోసం మరీ తొందర పడిపోతుంది. ఇంకెంత! రెండేళ్ళు. ఆవిడను ఇంతవరకూ తనే ఆపాడు.

'బావగారూ! మీ ఆలోచనా స్వర్గసామ్రాజ్యంలోంచి క్రిందకిదిగి ఈ అమృతం సేవించండి' అంది అతనినోటికి కప్పు అందిస్తూ.

'లత! ఏం కాఫీయిది. కారమూ లేక...' అంటూ చిలిపిగానవ్వుతూ ఆమె వంక చూశాడు.

'ఏదీ!' అంటూ కప్పు తీసికోబోయింది.

'లత! అయితే అమృతమే అన్నమాట' అంటూ గబగబ తాగేశాడు.

రవి మేనత్తకూతురు లత. రవి తల్లి చనిపోతూ రవిని అతని ఆస్తిని సుభద్రమ్మగారి చేతుల్లో వుంచింది. అప్పటి నుంచి సుభద్రమ్మగారు ఆ ఆస్తిని కాపాడుతూ రవిని అతని పెంచి పెద్దచేసింది. అప్పటికే లతతండ్రి పోయాడు. రవి 'ఎమ్మెస్సీ' చదువుతున్నాడు. ఈ ఏటితో ఆఖరు. వీళ్ళ పెళ్ళిచేసి తనబాధ్యత తీర్చుకొందామని ఆవిడ అభిప్రాయం. లతను 'ఎస్సెల్సీ'లోనే ఆపేసింది.

రవి నాచదువు అయ్యేవరకు చదివింతమంటే 'వద్దులేరా అది కాస్త సాయంగా వుంటుంది అని అతని కాలేజీలో చేర్పించలా

ఆరోజుతో రవిపరీక్షలు అయిపోతాయి. అంచేత ఆ సాయంకాలం పిక్చరుప్రోగ్రాము వేసికొన్నారు

తను రెడీఅయి రవికోసం ఎదురు చూస్తోంది.

రవి వస్తూనే 'ఎక్కడికి ముస్తాబు అయి కూర్చున్నావు' అన్నాడు.

'పిక్చరికి వెళ్దామన్నావుగా! అంది.

'ఇది మరీబాగుంది! నా ఫ్రెండ్సంతా వెళ్ళుతున్నారన్నాగాని నిన్ను తీసికెళ్తానన్నానా?'

'ఇదిగో మహానుభావా! నీతో ప్రయాణం అవడం అంత బుద్ధితక్కువ మరిలేదు. నీతో ఎవరూ ఇప్పుడు సినిమాకి రావటం లేదు' అంటూ లేవబోయింది.

'మరి సినిమాకి రావన్నేనా?'

'అట్టే' అని తల విదిలించింది. పొడుగాటి ఆమెజడ మెడచుట్టు ప్రదక్షిణం చేసింది.

'నిజంగానేనా' మళ్లీ రెట్టించాడు.

'ఆ! నిజంగానే!'

'లతా ఇదిగో నీకోసం బజారంతా గాలించి ఎంతచక్కటి బహుమతి తెచ్చానో' అన్నాడు చేతులు వెనక్కిపెట్టి.

లత అప్పుడుచూసింది అతని చేతిలోని ప్యాకెట్.

'ఏమిటిబావా అది' అంది అతని దగ్గరగావస్తూ ప్యాకెట్ అందుకుంటూ.

'మరి నువ్వు నాతోరావాలి'

'వస్తా ముందు అదేమిటోచూపు'

రవి ప్యాకెట్ వూడదీశాడు. లేతనీలి రంగుచీరమీద వెండిమబ్బు పూలతో తళ తళ లాడుతోంది చీర ఆ చీరను చూడ గానే లతకళ్లు మరీ పెద్దవయ్యాయి; 'చాల బావుందిబావా' అంది.

'ఆ! మరి కట్టుకురా' అన్నాడు సోఫాలో చేరగిలపడుతూ.

లత ఆచీర తీసికొని లోపలికివెళ్లింది.

# ముగింపు

లతగారికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు రవి

లేత నీలిరంగుచీరతో అందంగా నడచి వస్తున్న లతనుచూసి, 'రంభా! ఊర్వశా! మేనకా!...' అంటూ ఆమెకు ఎదురు వెళ్లాడు.

'మరి నీవు బట్టలు మార్చవా'

'నే నెట్లావుంటే ఏం లతా! నా పక్కన నిన్నుచూసి ప్రతివాళ్లూ నా అదృష్టానికి ఈర్ష్యపడతారు' అన్నాడు.

'పొరపాటు బావా! నిన్ను అందరికళ్ల నుంచి ఎలా తప్పించవా అని ఇందాకటి నుంచి అనుకొంటున్నా తెలుసా' అంటూ బీరువాలోని బట్టలుతీసి అతనిముందు పడేసి త్వరగారా! బావా! మనం సినిమాకి వెళ్లేది ఈరోజు' అన్నది అతన్ని తొందర చేస్తూ.

నీలం ట్వీడుసూట్‌మీద తెల్లని షర్టు టకప్‌చేసి లేత నీలిరంగు 'టై' కట్టుకొని పొడుగ్గా బలంగా ముఖంమీద జుట్టును అతి కష్టంగా వెనక్కి తోసు కొంటూ వస్తున్న రవినిచూసి.

'ఇంద్రుడో! జయంతుడో! కంతుడో!' అంటూ ఒకచేయి నడుంమీదా, ఒకచేయి బుగ్గమీదా ఆనించుకొని నిలబడ్డ లత చెవి పట్టుకొని.

'ఏంపిల్లా! మాటకుమాట బదులు చెప్తున్నావు జాగ్రత్త!' అన్నాడు

'సరే! ముందువదబాబూ' అంది చేయి తీసేస్తూ.

'అత్తయ్యా, ఓ అత్తయ్యా, రావమ్మా! టైం అయ్యింది' అని గట్టిగా కేక వేశాడు,

దొడ్లో పనిచేస్తున్న సుభద్రమ్మగారు రవికేకలకు హా డా వి డి గా 'ఏమిట్రా! ఏమయ్యింది' అంది కంగారుగా.

'తలుపువేసికో మేము వెళుతున్నాం' అన్నాడు నింపాదిగా.

'దీనికంత అరుపెందుకురా?' అని పక్కనిలబడ్డ లతనిచూస్తూ నిలబడింది.

ఆమె వుద్దేశ్యం గ్రహించనివాడిలా 'అత్తయ్యా! ఇంక నీదే ఆలస్యం' అంటూ తల ఎగరేశాడు.

పక్కనవున్న లత సిగ్గుపడింది.

'అబ్బ! ఎన్నాళ్లకు నీ నోరు మూత పడిందేతల్లి!' అన్నాడు లత మాట్లాడక పోవటంచూసి.

'పో! బావ!' అంది.

'అయితే నేను వెళుతున్నా! వస్తావా' అంటూ గబగబ మెట్లుదిగాడు.

'ఉండు! వుండు! అమ్మా తలుపు వేసికో' అని లత న్ననుసరించింది.

ఇద్దర్నీ కనుమాపుదాకా చూసి తలుపు వేసికొని వెళ్లిపోయిం దావిడ.

కబుర్లు చెప్పుకుంటూ, ఏ చీకూచింతా లేనట్లు హాయిగా నవ్వుకుంటూ నడుస్తున్న ఆ జంటను అందరూ కళ్లప్పగించి చూస్తున్నారు. బజారు వచ్చేసరికి చాల 'రష్'గా వుంది. అందులో ఆరోజు ఆదివారం. కార్ల మోతలు, సైకిలు బెల్లులు, అమ్మేవాళ్లఅరుపులు, కంగారు కంగారుగా వుంది. పిల్లలుకూడ అంత ధైర్యంగా ఆ బజార్లో తిరుగుతూంటే, లతకు చెప్పలేని భయంవేసింది. అప్రయత్నంగా రవి చేయిపట్టుకొంది.

'ఏం లతా! భయంగావుందా!'

'అబ్బ! అసలు నువ్వు రోజూ ఎలా వెళుతున్నావో నాకు అర్థం కావటంలేదు. దీనికంటే హాయిగా ఇంట్లోవుంటేనే నయం' అంది.

'నువ్వు అప్పుడప్పుడు వస్తావు



కాబట్టే నీ కలా వుంటుంది. కాని రోజూ తిరిగేవాళ్లకు అసలు ఏమీ అనిపించదు.' అంటూ తన కెదురుగా వస్తూన్న లారీ కేసి చూశాడు.

ఇద్దరు చిన్నపిల్లలు 8, 10 ఏళ్లుంటాయి. ఒకవేపునుండి రెండోవైపుకివస్తున్నారు. అసలు వాళ్లకు చుట్టు ఏం జరుగుతుందో తెలియనట్లుంది. అందుకే అంత తాపీగా వస్తున్నారు. వెనకనుండి 'బస్ హారన్'తో వులిక్కిపడి,

'లతా! నువ్వు అటు వెళ్లు.' అంటూ ఒక్క వరుగున ఆమెచేయి విదిలించి ఆ పిల్లలవేపు పరిగెత్తాడు. లారీవాడు హారను మోగిస్తున్నాడు. ఇవతల బస్సులు. కారు మోత. ఒక్క వరుసున ఆ పిల్లవాడిని అవతలకిలాగి తాను ఇవతలకు రాబోయాడు. కాని అంతలోనే లారీచక్రాల కింద అతని కాళ్లుండిపోయాయి. లత 'బావా'అంటూ రవిదగ్గరకి పరుగెత్తింది.

తెల్లని షర్టుఅంతా రక్తంతో తడిసిపోయింది. అతని కాళ్లనిండా రక్తం ప్రవహిస్తోంది. అతనికి స్పృహలేదు. ఇందాకటి వరకు హుషారుగా కబుర్లు చెప్పుతున్న రవి, ఇప్పుడు ఏ చలనంలేకుండ పడివున్నాడు. ఒక్కసారి వెక్కివెక్కి ఏడ్చి అల్లాగే స్పృహతప్పి పడిపోయింది లత.

ఎవరో యిద్దర్ని హాస్పిటలుకు తీసికెళ్లారు.

ఆ షాకునుంచి లత రెండ్రోజుల వరకు తేరుకోలేదు. కళ్లు తెరచిన వెంటనే తన ఎదురుగావున్న తల్లినిచూసి 'అమ్మా! బావ' అని వెక్కి వెక్కి దిండులో తల దూర్చి ఏడ్చింది.

'లే! లత. బావకు ఏం ఫరవాలేదు. నిజంగా మనం చాల అదృష్టవంతులము. నువ్వు ఇలావుంటే అతను మరీ బాధపడ్తాడు' అంది ఆవిడ.

రవికి వెంటనే ఆక్సిజన్ అవియిచ్చి అతన్ని రక్షించగలిగారు డాక్టర్లు. కాని అతనికాలు తీసివేయాలి' అన్నారు

లతకు ఆవిషయం ఆ సమయంలో చెప్పలేదు.

పదిహేనురోజులు అతన్ని అక్కడవుంచి తరువాత యింటికితెచ్చారు. ఈ పదిహేను రోజులు నిద్రాహారాలుమాని లత అతనికి కావల్సినవి అందించింది, ఎప్పుడూ కళ

# ముగింపు

కళలాడే ఆ యింట్లో నవ్వులే కరువయ్యాయి. రవి ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే వుంటున్నాడు. లత అతనికి ఎన్ని చెప్పినా అతని ధోరణి మారలేదు. సుభద్రమ్మగారు పెద్దతనంలో ఇది తట్టుకోలేక పోయింది. అయినా వాళ్లకోసం ఆవిడ లేచి తిరుగుతోంది, కాని ఆ ఓపికకూడ ఎన్నాళ్లోవుండక ఆవిడను మంచం ఎక్కించింది. అన్ని బాధ్యతలు ఒక్కసారి లత మీద పడ్డాయి.

'బావా కాఫీ!' అంటూ రవి దగ్గరకి వచ్చింది లత.

పడుకునే ఆమెవంక తలెత్తి చూశాడు. చిక్కిపోయిపాలిపోయినవి ఆమె చెక్కిళ్లు. అయినా ఆముఖంలోని చిలిపితనం రవికోసం అల్లాగే వున్నదనిపిస్తుంది.

'కాఫీ సరే! ముందు నువ్వుకూర్చో' అన్నాడు.

'ఇదేం కారం కాఫీ కాదులే!' అంది నవ్వుతూ.

'ఆసంగతి నాకు తెల్సు లతా! ఎందుకంటావా' నేను ఎల్లాగో వరుగెత్తలేనని నీకుతెలుసు అందుకే ఈ కుంటివాడిమీద నీకు చాలాజాలి' అన్నాడు.

అతను ఆమెవంక చూడటంలేదు. అతనిచూపు ఎక్కడోవుంది.

'బావా! ఎందుకిల్లా నన్ను క్షణం క్షణం చంపుతావు. నీకు కాలులేదని ఒక్కసారికూడ అనుకోలేదు. ఆ భావనే నాకు లేదు. మనం ఎలాపెరిగి పెద్దవాళ్లమయ్యామో నాకు తెల్సు. అయినా ఇంకా నువ్వు నన్ను అర్థం చేసికోలేదు. అదే బాధగావుంది.' అంది.

'క్షమించు లతా! ఐయామ్ వెరీ సారీ! ప్లీజ్!'

'—కాసేపు కూర్చో నీతో మాట్లాడాలి' అన్నాడు.

లత మెదలకుండ కూర్చుంది. ఆమె చేతిలోని కప్పు తీసికొని మెల్లిగ లేచి కూర్చుని తాగేశాడు.

కొన్ని రోజులనుంచి ఆలోచించి చేసికొన్న తన నిర్ణయం ఆమెకు చెప్పాలి. కాని చెపుతామనుకుంటే ఎలా మొదలుపెట్టాలో తెలియటంలేదు. అతని మంచానికి ఎదురుగావున్న కిటికీలోంచి బయటకి చూశాడు.

వాతావరణం చాల చల్లగావుంది. వాన వస్తుందన్నట్లు మెల్లిమెల్లిగా నల్లటి మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఇలావుంటే తనకు చాలయిష్టం. చిన్నప్పుడు తను, లత తోటంతా పరుగుపెట్టి ఆడేవాళ్లు. పెద్దయినాసరే. సూర్యుడు మబ్బులలోకి పోయివున్నట్లుండి ఆకాశం చల్లబడినప్పుడు లత, తాను తోట్లో షికార్లు చేస్తూ కబుర్లు చెప్పుకునేవారు పెద్ద వాన వచ్చేవరకు అత్తయ్య గోలపెట్టినా కదలివచ్చేవాళ్లు కాదు.

కాని ఇప్పుడు తాను కుంటివాడు. అయినా ఇంక కదలకూడదన్నారు. ఇద్దరి మనస్సుల్లో చెప్పలేనిబాధ. ఇద్దరికీ ఆసమయాన బయటకి వెళ్లాలనివుంది. అలాగే చూస్తున్న రవినిచూసి 'బావా' అంది.

రవి తలతిప్పి ఆమెవంక చూశాడు. 'ఇప్పుడు నీతో ఒకటి చెప్తాను. మళ్లా అపార్థం చేసికోకు'

'బయటకు వెళ్దామంటావా. ఎలా రాను నేను' అన్నాడు బాధగా.

'ఎందుకలా బాధపడ్తావు. ఇంకా నేను బ్రతికేవున్నా నీకాళ్లు పట్టుకొని ప్రార్థిస్తా. ఇలా ప్రతిదానికి నన్ను బాధపెట్టకు' అంది.

'లేదు లత. నువ్వున్నావనే నేనింత యిదిగాలేచి తిరుగుతున్నా. ఎందుకోనాకు తెలియకుండానే నానోటివెంట వస్తున్నాయి ఇలాంటిమాటలు. నేను ఏంచెయ్యను' అన్నాడు నుదుటిమీద చెయ్యి రుద్దుకుంటూ.

'లే బావ. తోటలోకి వెళ్దాము' అని తాను లేచి అతనికి తాను ఆసరాగా చేయి అందించింది.

తోటలోకి తీసికెళ్లి అక్కడ సిమెంటు బెంచీమీద కూర్చోబెట్టి తాను కూర్చుంది.

తోటంతా పచ్చగా కళకళ లాడుతోంది. కింద పచ్చటి తివాచీ పరచినట్లుంది గడ్డి మెత్తగా. ఎండాకాలం వెళ్లి పదిహేను రోజులైంది వర్షాకాలానికి నాందిగా సూర్యుడు పక్కకు తప్పుకుంటున్నాడు. ఎండకు ఎండిపోయిన మొక్కలు కొన్ని వానకే ప్రాణం పోసి

కొన్నట్లు కొత్త చిగుళ్లు వస్తున్నాయి. ముద్దమందార పూలు చెట్టంతా విరగ బూసి గాలికి వుయ్యాల లూగుతున్నాయి. వాటి వంకే తదేకంగా చూస్తున్నాడు రవి.

'బావా! ఏదో చెప్పుతా అన్నావు. అలాగే కూర్చుండి పోయావేమి?' అంది, అతి ప్రశాంతమైన ఆ ప్రదేశంలో అతి మృదువుగా ధ్వనించింది ఆమె కంఠం.

'చెప్పుతా! కాని ముందు నువ్వు మాట యివ్వాలి'

'నీ మాట ఎప్పుడు కాదన్నాను'

'అది నేను ఎప్పుడు మర్చిపోను లత. కాని నా తృప్తి కోసం ఒట్టు వెయ్యాలి' అన్నాడు బాధతో.

'ఒట్టు' అనంగానే అతని వంక చూసింది. ఆ కళ్లలో అదివరకటి వుత్సాహం లేశమైనాలేదు. ఏదో దృఢ సంకల్పం ఆ కళ్లలో కొట్ట వచ్చినట్లు కనిపించి, లత ఒకసారి కలవర పడి పోయింది. అందుకే అతని చేతిలో చేయి వేయక అలాగే వుండిపోయింది.

'ఏం లతా. అప్పుడే నా మాట అంటే నీకు నమ్మకం పోయింది కదూ. అందుకే ఒట్టు వేయులేకపోతున్నావ్' అన్నాడు అసహనంగా.

'సరే బావ నీ మాట ఏది ఇంతవరకు కాదనలేదు. ఇప్పుడు మటుకు ఎందుకు కాదనాలి' అంటూ అతని చేతిలో చేయి వేసింది.

'లతా నేను నిన్ను పెళ్లి చేసికోను. ఎందుకంటే నేను నీకు తగను'

'బావా' అంటూ కోపంగా లేచింది.

'లత. దయచేసి కూర్చుని స్థిమితంగా నన్ను అర్థం చేసికో. చూడు లతా. ఈ కాలు విరిగిన వాడితో నీకు పెళ్లేమిటి? నా కంటె చక్కని వాడిని నీకు పెళ్లి చేస్తా.'

'బావా. ఇక ఆపు. ఇదా రాత్రింబవళ్లు నువ్వాలోచించేది. ఎంత పిచ్చివాడవు బావా నువ్వు. ప్రేమ హృదయాల్లో వుంటుంది కాని, రూపంలో కాదు. నీ ఒట్టుతో నన్ను కట్టి వేద్దామనుకున్నావు కాబోలు. నా పెళ్లి అన్నా మానుతా గాని, నీ కోర్కె నా కంఠంలో ప్రాణం వుండగా తీర్చలేను.' అంటూ విసురుగా లేచి రెండుమూడడుగులు వేసి వెళ్లబోయి రవి పిలుపుకి వెనక్కి తిరిగింది. ఆమె కళ్లను చూస్తుంటే అతనికి కొస్త భయం వేసింది.

'లత. నన్ను వదలి వెళ్లిపోతున్నావు. నేనెలా రాను' అన్నాడు బాధగా.

అతని మాటలు, అమాయకమైన ఆ ముఖం చూసి ఆమె మనస్సు చెప్పలేని బాధతో వూగిపోయింది. పెదాలను పళ్లతో బిగించి అతి ప్రయత్నం మీద తన్ను తాను నిగ్రహించుకొని రవి దగ్గరకు వచ్చి అతని నుదుట మీద జుట్టును ప్రేమగా వెనక్కి తోసింది.

'లతా నువ్వు నా మీద ఒట్టువేశావు. గుర్తుంచుకో. నువ్వు నా మాట కాదంటె నేను' అన్నాడు మెడవాల్చి చేతులు చాపి.

ఆ మాటలకు ఆమె ఏమి జవాబు చెప్పక 'పద బావ. వాన వచ్చేట్లుంది' అని అతన్ని తీసికొని లోపలికి వెళ్లి పోయింది.

ఎంతోసేపు వుండబట్టలేని మేఘాలు వర్షాన్ని కురిపించాయి.

రవి బలవంతాన లత వివాహం శేఖర్‌తో అయింది. ఈ పెళ్లి ఎంత మాత్రం సుభద్రమ్మగారి కిష్టంలేదు రవికి ఎంతో చెప్పచూసింది కాని అతని అభిప్రాయాన్ని ఆమె కొస్తకూడ మార్చలేకపోయింది. ఆవిడ కేవలం ఒక బొమ్మ లాగా నిలబడింది.

* * *

సాయంకాలం నీరెండలో సన్నజాజి పందిరికింద మంచంవేసికొని కాళ్లు అటూ ఇటూ వూపుతూ చదువుతున్నది భారతి. సన్నని ఆమె వేళ్లమధ్యవున్న కాగితాలు గాలికి రెపరెప లాడుతున్నాయి. పొడుగాటి ఆమెజడ మంచంక్రిందకుజారి నేల ముద్దు పెట్టుకొంటున్నది. తలలోని జాజులు తమ పరిమళాలను వెదజల్లుతున్నాయి ఆ కథ పూర్తి అవటంతో చదవటం ఆపింది.

ఈ కథ చదవమని బావ అనకెందుకిచ్చాడో ఆమెకి పూర్తిగా అర్థమయ్యింది. ఎన్నడు అతను అన్నకథలు చదమన్న పాపానపోలేదు. ఈ రోజు ఈ కథనిచ్చి 'చదివి నీ అభిప్రాయం చెప్పమన్నాడు పైగా' అప్పుడే అనుకొంది ఇదేదో ప్రళయమను కొని. కాని ఇలాంటి అభిప్రాయం అతని కుంటుందని ఇది చదివాక తెలిసింది. ఇక ఇలాంటి ఆలోచనలు కలుగకుండ మంచి బుద్ధి చెప్పాలనుకొంది.

సాయంకాలం వెలుగు మెలమెల్లగ తరిగి పోయింది. పందిరికి దూరంగావున్న ఆ గులాబీల జంట గుసగుస లాడుతున్నాయి గాలికి పందిరిమీద కొయ్యకుండావున్న పూలు



# ముగింపు

ఆమెమీద రాలాయి. అవేమీ ఆమెకు ఆటంకం కలిగించలేదు. కదలాడుతున్న పాదాలు హఠాత్తుగా ఆగాయి. సన్నని పెదాలను పళ్ళతోనొక్కి, ఒక్క వుదుటున మంచం మించిలేచి లోపలికి పరిగెత్తింది. నల్లటి పొడుగాటి ఆమెజడ అందంగా వూయలలూగింది.

ప్రియమైన బావా!

నీ కథ చదివి నా అభిప్రాయం చెప్పమన్నావు. ఇక కథగురించి అభిప్రాయం — ఈ కథ సహజంగా మూడు వంతులు నడచింది. (అది అంతా మన కథ లాంటిది కాబట్టి) ఒక ముగింపు ఎల్లావుందంటావు అచ్చు మన పిన్నిగారిలాగ. (ఆవిడని చూడంగానే నీ ముఖారవిందం ఎల్లావుంటుందో నీకు తెల్సు అయినా మళ్ళా యిక్కడ రాస్తున్నా, ఆముదం తాగినట్లు) నీకథకు అందమైన ముగింపు నేను చెబుతా చూడు. దాన్ని నువ్వయినా సరే, ఎవరైనసరే 'కాపీ' కొడితే తగినచర్య తీసికొనబడును. తస్మాత్ జాగ్రత్త! నువ్వు నా బావవని వూరుకొంటా వనుకోకు

నీ కథ ఎక్కడ ఆపావో అక్కడ్నుంచి 'బిగిన్' చేస్తున్నా లత, శేఖర్‌ల వివాహంచేసి రవి తెరమరుగవుతాడు ఇక చదువు—

పాపం వి వశమున ఒకానొక సందర్భమున శేఖర్ అంధుడయ్యె విధినెదిరించుట ఎవరితరము (ఇలాంటి బరువైన డైలాగులు నీ రచనలో మచ్చుకైన ఎక్కడ కానరావుకదా). తన చేతులతో అంటే 'ఓన్‌హాండ్స్'తో చేశాడు కదూ వారి వివాహం. అందువలన అదంతా తనవల్లనే కదా ఇట్లు జరిగెనని దురపిల్లెను. (అన్నం, నీళ్ళు, నిద్ర లేకపోవటం ఇదంతా మామూలే.)

రవి స్థితిచూసి లత ఒకనాడు ఇలా అంది—

'బావ నాకు ఇంతే ప్రాప్తం. నాకు ఏవంక లేనివాడ్ని చెయ్యాలనుకున్నావ్. కాని ఇప్పుడేమయింది ఆయనకు కళ్ళు పోయాయి. నా నుదుట భగవాన్ ఇలారాశాడు. నువ్వు చింతించక' అని ఓదార్చెను. రవి మళ్ళీ తెరమరుగయ్యెన్. శుభం.

'ఎల్లావుంది బావా నా ముగింపు'

ఒకచేయి దిండుల కానించి పడుకొని భారతి రాసినకథ చదువుతున్న నేను అటు తిరిగా.

గుమ్మానికి ఒకచేయి ఆన్చి మెడ అలవోకగా ఒకభుజంమీద వాల్చి నిలబడింది—భారతి.

సంధ్యాకాలమైంది సూర్యుడు మెల్లగ క్రిందకు దిగుతున్నాడు — సన్నటి చీకటి తెరలు మెల్లగ గదుల్లోకి జొరపడుతున్నాయి. అందుకే ఆమె ముఖం నా కంటి స్పష్టంగా కనబడలేదు కాని ఆ కళ్ళలోని మెరపు చీకట్లో కూడ తళతళ లాడుతోంది. అందుకే ఆ కళ్ళంటే నా కిష్టం,

ఆమె రాసిన కథ అప్పుడే పూర్తి చేసిన నేను 'నీ ముఖంలా వుంది' లన్నా. నా చెంపమీద నా చేయి తీస్తూ. ఇందాకటి నుంచి అలా పడుకొన్నానేమో ఆ చేయి నొప్పి పుట్టింది.

'అయితే ఇంకేం చాల బావుందన్న మాట' అంటూ లోపలికి వచ్చి గోడకున్న లైటు స్విచ్ వేసింది.

అంతవరకూ వున్న చీకటి ఒక్కసారి పారిపోయింది. వెలుగు ఒక్కసారి వచ్చేసరికి నా కళ్ళు రెపరెపలాడి సర్దుకొన్నాయి, లైటు వెలుగులో ఆమె సౌందర్యం మరింత ప్రకాశిస్తోంది. రాళ్ళ జూకాల వెలుగు నున్నటి ఆమె చెక్కిళ్ళమీద పడి అటుఇటు పరుగులిడుతోంది.

'నన్ను తిరిగ్గా చూడ్డంవుగాని, ముందు నేనడిగిన దానికి జవాబు చెప్పు' అంటూ అక్కడ వున్న స్టూల్ నా దగ్గరగా లాక్కొని కూర్చుంది.

భారతి అడిగిన ప్రశ్న గుర్తు వచ్చింది.

'నువ్వు అడిగింది నీ కథ ముగింపు ఎలా వుందని కదూ, చెప్పనా. చెత్త!' అన్నా ముక్కు మూసుకొంటూ.

'నా కథ చదివి గొప్పగా ముక్కు మూసుకొన్నావుగాని, నీ కథ చదివిన వెంటనే ఆత్మహత్య చేసికొందామనుకొన్నా' అంది కోపంగా. ఆమె కళ్ళు నా మీద యుద్ధం ప్రకటిస్తున్నట్లున్నాయి.

'అలాగా! నా కథలు ఆత్మహత్య కన్నా వుపయోగపడుతున్నందుకు సంతోషించు. జీవితం మీద విరక్తి కలిగినవాళ్ళు

మండ్రుల షాపుకు వెళ్ళారు. ఎక్కడకు వెళ్ళతారో తెలుసా. బుక్ స్టాలుకి! వెళ్ళి ఫలానాఆయన పుస్తకం ఒక టివ్వండి' అంటారు నాపేరు దశదిశలా వ్యాపిస్తుంది. నా పుస్తకంవిలువ వెయ్యిలో వుంటుంది. ఆ తరువాత ... అంటూ మంచంమీద లేచి కూర్చున్నా.

'ఎరక్కపోయి అన్నా ఈ పురాణం ఆపు బావా!' అంది.

'లేకపోతే నాతో ఆటలనుకొన్నావా!' అన్నా కాలరెత్తి.

'అసలు సంగతి చెప్పక ఈ పైత్య మేమిటి? ముందు నా కథ ముగింపు ఎలావుంది' అంది రెండుచేతులూ గడ్డం కింద చేర్చి కుతూహలంగా. 'అలా ఎన్నటికి జరుగదు. అన్నా ఖచ్చితంగా'

'ఏం? ఎందుకు జరుగదు? నువ్వు రాసినట్లు జరుగగా లేంది నేను రాసినట్లు ఎందుకు జరుగదు?' ఆమెచేతులు బిగుసుకొన్నాయి.

'నాది నిజంకాబట్టి' అని వెంటనే నాలిక కరుచుకొన్నా. కాని ఏంచేయను. నోరు జారేశాను.

'నాది అంతకన్నా పచ్చినిజం'

ఎవరి మనసుల్లో వాళ్ళకి ఈ నిజం తెలుస్తూనే వుంది.

ఇంతవరకు ఎవరు బయటపెట్టడమూ అన్న సందిగ్ధమే మమ్మల్ని వేధిస్తోంది.

'డియర్ భారతీ అలా ఎన్నటికి జరగదు.'

'మై డియర్ త్యాగరాజా' అంది లేచి నించుంటూ.

గదంతా చూశా. నాకు ఆ త్యాగరాజా ఎవరు కనబడలేదు. నా అవస్థచూసి పకపక నవ్వింది. గదిలోని లైటు ఒకసారి వెలవెల బోయింది.

'త్యాగరాజా ఇంకెవ్వరు. నువ్వు. ఇకనుంచి నీపేరు త్యాగరాజని పిలువబడును త్యాగాలకు రాజువి నువ్వు, ఆరాజుని పొందిన నేనెంత ధన్యురాలను అంది. తన సన్నని వేళ్ళతో జడ అల్లుకుంటూ. ఆమెకళ్ళు అల్లరిగా నవ్వుతున్నాయి. వాటిని చూడంగానే నాకు చాలకోపం వచ్చింది.

'నేనేం త్యాగాలుచెయ్యాలా' నాకంఠం నాకే గట్టిగా వినిపించింది,

'పిచ్చిబావా! నీకేం తెలియదు అందుకే నువ్వంటే నాకు చాలయిష్టం' అంటూ ఆమె తన చేతులలో నాముఖం పైకెత్తింది మృదువైన ఆమెచేతుల్లో అల్లాగే వుండాలని పించింది

'నాముఖంచూసి నిజంచెప్పు నువ్వు రాసినది మనకథే కదూ!' అంది మృదువుగా. ఎర్రని ఆమె పెదాలు మృదువుగా నవ్వుతున్నాయి. ఆమె మాటలకు మంత్రముగ్ధుడ్నయి 'అవునని' తలూపా. నా ముఖంమీదనుంచి ఆమెచేతులు తీసి ఇందాక తను కూర్చున్న కుర్చీలో కూర్చుంది. ఆమెపాదాలు నేలను అటుఇటు రాస్తున్నాయి. ఆమెచీర కుచ్చిళ్ళుకూడ వాటికి లయగా తాళం వేస్తున్నాయి,

ఆమె పాదాలవంక అలాగే చూస్తూ కూర్చున్నా.

నీ కథంతా మనగురించే అని నాకు తెల్సు. సంభాషణలు అన్ని మనం రోజు అనుకునేవే 'కేవలం పేర్లుమార్చావు నీ కథ చదివాక నీ అభిప్రాయం నాకర్థమయింది. ఈ నీ అభిప్రాయం మటుకు నీదికాదు. సినిమాలు, పుస్తకాల అభిప్రాయాలు. కాని అవి చూడడానికి చదవడానికి బావుంటాయి. కాని అవే మన జీవితాల్లో చేద్దామను కొంటున్నావు. అది అసాధ్యం. అలా ఎన్నటికి జరుగదు.

'ఏం? ఎందుకు జరుగదు?'

'నీ గురించి నాకు పూర్తిగా తెల్సు కాబట్టి' అంది వెంటనే. 'నీ కాలికి దెబ్బ తగలకపోతే ఈపాటికి మనిద్దరికి వివాహం అయ్యేది. నీకు కుంటి అయినంతమాత్రాన నీ మీద నాప్రేమ తరుగుతుందను కున్నావు. ఇంకోటి ఏమిటో చెప్పనా. ఇంతచెట్టంత మనిషినేవుండగా నాతో నీ అభిప్రాయం చక్కగా చెప్పవచ్చుగదా. అదంతా ఒకకథరాసి నా ప్రాణాలు తీశావు. ఇదంతా కథలోలాగ జరుగుతుం దనుకున్నావు. నువ్వు రాసిన కథలోలాగానే మన నిజజీవితంలో జరగాలనుకున్నావు నీ కథలో రవిలాగ నువ్వుండగలవా అని అనుమానం, ఒకవేళ నువ్వు ఆపని చేయికల్గినా నేను లతలాగ ఎప్పటికీ కాను.! అని బరువుగా వూపిరి తీసిందామె.

ఆమె కంఠములోని స్థిరసంకల్పము కొట్టవచ్చినట్లు కనబడింది. భారతి అన్నది నిజమే ఆమెను వదిలి ఒక్కడే తాను ఇంతవరకు వుండలేదు. ఈ కాలు కుంటితో ఆమెను నాపక్క చూడాలంటే నామనస్సు అంగీకరించటంలేదు. ఆమె హృదయాల్లో నా స్థానము చాల బలమైనదని తెలుసు నాకాలుకి ఆ ప్రమాదం



జరుగకపోతే ఈపాటికి మెహు లాజ్ మహల్ దగ్గర ప్రపంచంలోని ఆనందం అంతా మాదేనని తిరిగేవాళ్లము. ఆమెకు చెప్పే ధైర్యము లేక తన నవ్వులతో నా అభిప్రాయం త్రోసివేస్తుందని కథలాగ వ్రాసి యిచ్చా.

రెండు చేతులలో నా ముఖం తుడుచుకొన్నా కిటికీలోంచి నన్నుని వెన్నెలకాంతి లోపలికి వచ్చి లైటుకాంతిలో కలిసి పోతోంది. నా కాలివంక ఒకసారి చూసుకొన్నా. తొందర్లోనే ఆ కాలు బాగవుతుందన్నారు. నాకాలు విరిగినాకూడ ఆమె మాటలలో నాకు అసలు కాలువిరిగిందన్న ఆలోచనే నాకు దూరం అయింది. ఎప్పటికి నేను సరిగ్గా నడవగలనో. నా దృష్టిలో భారతి నేను ఒకళ్లచేతులు ఒకళ్లు పట్టుకొని వేగంగా నడచిపోతున్న దృశ్యం అందంగా కనబడుతోంది. 'నిజమేనేమో' అనుకొన్నా కాని నాకాలుకి డాక్టరు కట్టినకట్లు అల్లాగేవుంది.

'భారతీ! ఈ కాలుతో నిన్ను చేసికోవడం నాకు యిష్టంలేదు.' నా కట్టుమీద దృష్టి వుంచి అన్నా.

'అల్లాగే నువ్వు చేసికోవద్దు నాయినా. నువ్వునాకు కట్టబెట్టే ఆ మహానుభావుడికి ఏకాలో ఏచేయో విరిగితే' ఆమెముఖం నాకు కనిపించకుండ అటు త్రిప్పేసుకుంది అంటూ.

'భారతి అల్లా జరుగుతుందని ముందే ఎందుకనుకొంటావు?'

'నువ్వు జరగదని రాసివ్వు అలాగే చేసికొంటా'

కిటికీలోంచి చల్లని గాలి తెరలు తెరలుగ వస్తోంది. నా కాలికింద వున్న దుప్పటి పైకి లాక్కున్నా భారతి లేచి కిటికీ రెక్కలు కాస్త దగ్గరగ వేసి వచ్చింది.

'చిన్నప్పట్నించి ఒక్కటిగా పెరిగాము. మనం ఎన్ని తిట్లు తిట్లు తిట్టుకున్నా, ఆ తిట్ల వెనుక తియ్యటి అనుభవము, ఆప్యాయత ఎన్నటికి చెరగదు. ఇంకా నువ్వు అదే అభిప్రాయంతో వున్నావా?' అంది. నాకు దగ్గరగా వస్తూ.

'చెప్పు బావా! ఏమిటి ఆలోచిస్తున్నావు?' అంది తిరిగి. ఆమె నల్లని కాటుక కళ్లలోని ఆప్యాయత అంచులు

# ముగింపు

దాటి ప్రవహిస్తోంది.

'ఈ కథను ఎలా ముగించనా' అని అన్నాను. ఆ కళ్లను చూస్తూ. 'చెప్పనా' అంది నా పక్కనే కూర్చుంటూ. నా ప్రక్క మీద పడి వున్న ఆమె వుత్తరం చించేసింది. ఉండు ఇప్పుడే వస్తా అని లోపలికి వెళ్లింది.

ఆమె చేసేదేమిటో నా కర్థం కాలేదు. ఎందుకు ఆలోచించటం. ఆమె వస్తుందిగా అనుకొని ఆమె రాక కోసం ఎదురు చూస్తూ మంచం మీంచి లేచి కుంటుతూ మెల్లిగా అక్కడ సోఫాలో జారగిలపడ్డా.

ఆమె వస్తూనే ఆమె చేతిలోని నా కథ కాగితాలు చూశా. ఆమె కథ కాగితాలు నాకు యిచ్చి చివరి రెండు పేజీలు తీసి చించేసింది.

'ఏయ్! అది కథ. ఎందుకలా చించేస్తావు. ఎంతో కష్టపడి రాసినది'

ఆ కాగితాలు ఆమె చేతిలో ముక్కలు ముక్కలవుతూంటే చూడలేక పోయాను

'నిజమైన కథ రాసినప్పుడు ఆ కథ ముగింపుకూడా అంత నిజమై వుండాలి. కనుక ఇప్పుడు ఈ కథకు ముగింపురాయి' అంటూ టేబిల్మీదవున్న కాగితం పెన్ను యిస్తూ అంది.

గదిలోని ఆ చిన్నముక్కలు రెప రెపలాడుతూ తలో మూలకి ప్రయాణం చేశాయి.

'నువ్వు రాయరాదూ' అన్నా.

'నువ్వు నన్ను రాయమన్నావు కాబట్టే, నేను బాగా రాస్తావనే అర్థం. కాని రాసే ఓపికలేదు. కాని ఒక్కటి చెప్తాను విను.

నువ్వు ఎప్పుడు కథలోలాగా జీవించాలని ప్రయత్నించకు. రాసినంత అందంగా నువ్వు చెయ్యాలనుకోడం నీ భ్రమే అవుతుంది. నువ్వు త్యాగరాజుకాక నారాజుగా వుండు' అంది నవ్వుతూ.

నేను ఏమి మాటాడక ఆమెయిచ్చిన కాగితంమీద రాస్తున్నా. భారతి సోఫా వెనకకువచ్చి వంగి నే రాసేది చూడబోయింది. ఆమెకు చదవాలన్న ఆత్రుతను నా చేతితో అడ్డుపెట్టి నవ్వుతూ.

'ఏయ్! అమ్మాయ్! బుద్ధిగా అల్లా కూర్చో. అప్పుడేయిస్తా' అన్నా.

'ఎంతసేపు బావా' అంటూ విసుగ్గా లేచి కిటికీదగ్గరకువెళ్లి నుంచొని కిటికీ రెక్కలుతీసి బయటకుచూస్తూ నుంచొంది.

'ఇదిగో! నేరాసిన కాగితం.' అని ఆమెను పిలిచి ఇచ్చా.

'లతా, (నిన్నే) ఇంకెప్పుడు యిలాంటి పిచ్చి 'ఐడియాస్'తో నిన్ను బాధపెట్టను. ప్రేమమూర్తి అయిన నువ్వు నాదానివన్న గర్వమే నా నరనరాల్లో కల్గుతోంది.' అంటూ రవి 'లతా!'అని చేతులుచాపాడు.

'రవీ!' అంటూ లతదగ్గరగా వచ్చింది. అంటూ చదివి తిరగబోయింది కాని ఆమె వెనక నన్నుచూసి 'అబ్బా ఎంత ఆశ' అంటు బయటకు పరిగెత్తబోయింది.

'ఏయ్ ఆండాళమ్మా! ఆగు ఒక్కమాట విను' భారతి నామాటవిని వెనక్కు తిరిగింది ఆ తిరగడంలో నల్లని పొడుగాటి ఆజడ మెడచుట్టు తిరిగింది.

'నాపేరు అదేంకాదు. అయినా వెల రోజులకి మళ్లీ తిరిగి నీ నోట ఈపేరు వింటుంటే నీకు ఎదురు చెప్పాలనిపించటల్లేదు' అంది. ఆ కళ్లు ఆనందంతో తళుక్కుమన్నాయి.

'నాకథకి ముగింపు ఎలావుందో చెప్పకుండ వెళ్లితేఎలా' అక్కడే నుంచొని 'ఇంక వేరేచెప్పాలా' అంటు నన్ను వెక్కిరించి వెళ్లిపోయింది.

'ఆమె వెళ్లిపోయినా వన్నజాజుల పరిమళం అక్కడే వుండిపోయింది రాత్రింబగళ్లు నన్ను తినేసిన పాడు ఆలోచనలన్నీ దూది పింజలాగా ఎగిరిపోయాయి. ఈ కుంటికాలితో భారతిని చేసుకోడం అన్యాయం అవుతుందేమో అలా అని ఆమెను వదులుకోలేడు. కథ అయితే రాసేసా. ఇది పత్రికలోచదివి పాఠకులు మెచ్చుకొనేవారు తనని. నిజజీవితంలో అంత తేలిగ్గా భారతిని తాను ఎవరికన్న తన చేతులతో సమర్పించేవాడా...లేదు...అపని చెయ్యలేడు. ఇలాంటి రచనలతో పాఠకులను మోసం చేస్తున్నానా అనిపించింది. అయినా ఇప్పుడు నామనస్సు వాటి గురించి ఆలోచించే స్థితిలోలేదు. నాకథకు అందమైన ముగింపు దొరికింది అంతే చాలు ★

# మామూలు జలుబు కొంతమంది జనులకు త్వరగా వస్తుంది. కొందరికి రాదు. ఎందువలన?



జలుబుచేయడానికి, ఆకలి లేకపోవడము, అలసట, చర్మము మరియు పళ్ళ జబ్బులు మొదలైన అస్వస్థతలకు విటమినులు మరియు లోహ ధాతువులు లేకపోవడము కారణము కావచ్చును మీకు విటమినులు మరియు లోహ ధాతువులు క్రమంగా లభించుటకు ప్రతిరోజు ఒక విమ్‌గ్రాన్‌ను వేసుకోండి విమ్‌గ్రాన్‌లో 11 ముఖ్యమైన విటమినులు మరియు 8 ముఖ్యమైన లోహ ధాతువులు ఉన్నాయి. కనుక దానితో ఆరోగ్యము, బలము, శక్తి మరియు బలమైన రోగనిరోధక శక్తి కలుగుతాయి.

**విమ్‌గ్రాన్®**

(మల్టిపుల్ విటమిన్స్-మినరల్స్ టేబ్లెట్లు

SQUIBB® SARABHAI CHEMICALS






ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది.

® ఇ ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్క్‌కు చిహ్నము. దీని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi SC 4A/69 TEL

# వెలుగు నీడలు



యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్

### జరిగిన కథ

రాజశేఖరంగారి ఒకే ఒక కూతురు అనుపమ. ఆయన మిత్రుని కుమారుడైన మధుని ఆదుకుని తన యింట్లోనే ఆశ్రయం యిస్తారు. మధుమూర్తి అనుపమ అభిమానాన్ని పొందుతాడు. రాధా మాధవీయం నృత్యనాటికతో వారి అనుబంధం మరింత దృఢం అవుతుంది విదేశాలనించి వచ్చిన అనుపమ బావ విజయకుమార్ వీరి అభిమానాన్ని సహించలేడు. మధుమూర్తి ఊరికి వెళ్లిన అనుపమ అక్కడ మాధవిని చూసి అపార్థం చేసుకుంటుంది. జరిగింది వివరిస్తాడు మధు విజయకుమార్ బారి నుండి అనుపమ శీలాన్ని రక్షిస్తాడు మధుమూర్తి అనుపమ మధుల అనుబంధం విడదీయరానిదిగా రూపొందుతుంది. రాజశేఖరంగారు విజయకుమార్‌ని సమర్థించడం అనుపమకి బాధ కలిగిస్తుంది. కుమార్ మధుని అవమాన పరచాలని చూస్తుంటాడు. అనుపమకి కుమార్ మీది ద్వేషం అధికమవుతూ వుంటుంది.

## 11

దీపావళి. జీవితంలో క్రొంగ్రొత్త వెలుగుల్ని పండించే పర్వదినం. చివురించిన ఆశలతో, అనురాగలతో హృదయాలయాల్లో దీపాలతోరణాలు వెలిగాయి. కనుల పండువుగా, మనస్సుల్లో ఆనందం నిండగా, అంధకారమూ, అజ్ఞానమూ యీ దివ్వెల వెలుగులో కరిగి కాంతి రేఖలతో భవిష్యత్తు బంగారుమయం కావాలన్న ఆంకాక్షతో నమస్కరించుకునే పవిత్ర దినమది.

మధుమూర్తి మాధవిని యింటికి పంపించి పదిరోజులై పోయిందప్పటికే. ఆమె పరిస్థితిలో ఏమార్పూలేదు. అందుకే 'పాలెం' పంపించాడతడు.

సాహితీ రంగాన అతని ప్రఖ్యాతి నానాటికీ పెరిగిపోతుంది.

అనుపమ హృదయాన క్షణక్షణానికీ స్థిరమైన స్థానం ఏర్పడుతోందతనికి.

విజయకుమార్ ప్రోత్సాహంతో, రాజశేఖరంగారుకూడా బయలుదేరారు అనుపమా, మధుమూర్తులతో పాటు.

నీలగిరి కొండల సౌందర్య శోభని చూడాలని బయలుదేరారు. మొదట్లో మధుమూర్తి రావడానికి వీలుండదన్నాడు. అనుపమ వుత్సాహం చల్లారిపోయింది. విజయకుమార్ మాత్రం సంతోషించాడు.

కానీ అతడి సంతోషం ఎంతోసేపు నిలవలేదు అనుపమ ప్రోద్బలంతో మధుమూర్తి బయల్దేరాడు. ముఖాన గంటు పెట్టుకున్నాడా డాక్టరు.

ప్రయాణంలో హుషారుగా అనుపమతో గడిపివేయాలనుకున్న అతని పథకం తల్లక్రిందులై పోయినందుకెంతగానో బాధపడిపోయాడు.

తీరా అపుడు రానంటే రాజశేఖరంగారు నవ్వుతారేమో! వాళ్లిద్దరి ముందు తన బలహీనత బయట పడుతుందేమోనన్న వూహతో బయల్దేరాడు

నీలగిరి చేరగానే అనుపమా, మధుమూర్తుల హృదయాలు ఆ ప్రకృతి శోభకి పులకించి పోయాయి.

చల్లనిగాలి. మెల్లగా పయనించుతూన్న నీలినీలి మేఘాలు! క్షణానికో చల్లని తుంపర! పచ్చని తివాచీలు పరచినట్లున్న ప్రకృతి!

రంగురంగుల పూల తోరణాలతో, ఒయ్యారాలొలికించే లతలతో,, అందాలు గుమ్మరించుతూ కనుల పండుగ జేస్తూన్న తోటలు!

మనస్సున మల్లెల పరిమళాల్ని నింపుతూన్న మధురమైన వాతావరణం. లోతైన లోయల్లో గలగలా పారుతూన్న సెలయేళ్లు! ఎత్తయిన కొండలపై ఎన్నోరకాల వృక్షాలు. నీలిమబ్బుల పరదాల మాటున తారకల తళతళలు.

మధుమూర్తి హృదయాన ఆనందం పరుగులు పెడుతోంది. ఆ సౌందర్యారాధనలో అతడు మైమరచిపోయాడు.

'బొటానికల్ గార్డెన్స్'లో పూల అందా

లను వర్ణిస్తూ అన్నాడు—

'ఒనుపమా! ఈ విరిసిన మందారాల్లో వృష్టికి చూడెంత పసుపు వర్ణంలో వుందో! ఎంత సుకుమారంగా నవ్వుతున్నాయి! ఈ ఎర్రని గులాబీలు!

నీలి మేఘాల్లో తేలిపోతూన్న యీ మనస్సుల్లో నిజంగా దివ్యత్వం మేల్కొంటోందేమో!

ఆ సెలయేరు చూడు! ఎంత ఆనందంగా తుళ్ళిపడిపోతూ, పరుగులు పెడుతూందో!'

అతని వర్ణనలతో విజయకుమార్‌కి మతి పోయేట్లుంది. అందుకే అన్నాడు కొంపుగా అతనిమాటల్ని త్రుంచివేస్తూ నిర్లక్ష్య భావంతో—

'స్త్రీల అందాలకన్నా నాకు మీమాటలే విన సొంపుగావున్నాయి! ఎందుకంటారా? అందులో వున్నదంతా సత్యం గాదుగా! అయినా యింత ప్రయాస మీరుదేనికి పడుతున్నట్లో?'

'సృష్టిలోని అందాల్ని చూసి ఆనందించడం కూడా తెలియని మూర్ఖులున్నారే! వాళ్ళనెలా మనుషులుగా తయారుచేయాలా? అని' అన్నాడు మధుమూర్తి వ్రుదికత కించిత్కూడా లేని స్వరంతో.

'సంఘసేవ ఎప్పుడు మొదలెట్టారండోయ్? రచయితగారూ!' వ్యంగ్యం వెల్లివిరిసిం దతనిగొంతులో.

'చదువునేర్పిన సంస్కారం సమాధిలో వుండిపోయిన క్షణాన డాక్టర్‌గారూ!' ఆ వ్యంగ్యోక్తిలోని యుద్ధారానికి డాక్టర్ నోరు తక్కున మూతబడిపోయింది.

అనుపమ మనస్సు తృప్తిగానవ్వుకుంది. రాజశేఖరంగారా వాగ్యుద్ధాన్ని అంతటితో ఆపివేయమన్నారు చిలికి చిలికి గాలివానే తుఫానులా విజృంభిస్తుందన్న వూహతో

'నాకేమీ నచ్చలేదు మామయ్యా! యీ కంట్రీ! ఇంగ్లండు చూడాలి!' మనజన్మ తరించాలి! ఏముందీ తీరూతెన్నూ లేని ఇండియా?' అన్నాడా విదేశీయ నాగరికతా వ్యామోహంలో కొట్టుకుపోతూ. ఆమాటలు మధుమూర్తిని వుడికించి వుద్రేకపరచడానికన్నవని గ్రహించాడు రాజశేఖరంగారు. అందుకే అతనివైపుచూసి భావగర్భితంగా మందహాసం చేశారు సమాధానం చెప్పమన్నట్లు.

'డాక్టరుగారూ! మీమాటలు వినగానే నాకోచక్కని కథ గుర్తుకొచ్చింది. ఓసండి తుడు బీదతనంతో బాధపడుతూంటే లక్ష్మీదేవికి జాలికలిగిందట! ఆతడిని కుబేరుణ్ణి చేద్దామని నిర్ణయించుకొని ఓనాడు.

ఆ మూర్ఖుడు ప్రతిరోజూ దారిలో ఎక్కడేం దొరుకుతుందో అని కళ్ళు పెద్దవి చేసికొని మరీ వెతుకుతూ పోతూండేవాడు



కాని ఆ రోజానమాత్రం కళ్ళు గట్టిగా మూసుకుని వెళతాసిరోజా! ఏవౌతుందో చూద్దాం' అనుకుని కళ్ళుమూసికొని నడుస్తున్నాడు. లక్ష్మీదేవి రత్నాలరాసుల్ని కుప్పలు పోసిందట దారిన.

కానీ ఆ కళ్ళున్న అంధుడికెలా కన్పించు తాయా రాసులు! ఆ రాసుల్ని దాటిన తర్వాత కళ్ళు తెరిచాడట.

అపుడనుకుందట లక్ష్మీదేవి 'ఓరి! మూర్ఖుడా! ఎంత దురదృష్టం వ్రాసి వుందో నీజాతకంలో! కనులుండీ అంధుడివై పోయావ్! ఈజన్మకి నీ అదృష్టం యింతే' అని.

తల్ల కింద ధనరాసులుంచుకుని కొండ రాళ్ళకోసం వెదకబోయేవాడట వెనుకటికో మనిషి' మృదువుగావున్నా సూటిగా విడిచిన బాణంలా సరిగ్గా నాటవలసినచోటే తగిలిం దాబాణం.

ఆ డాక్టరి ముఖం తెల్లగా పాలిపోయింది. తర్వాత పెదవికదిపిన పాపాన పోలేదాతడు.

తండ్రీ కూతుళ్ళిద్దరూ ప్రశంసాపూర్ణదృక్కులతో మధుమూర్తిని అభినందించారు.

ఆ రాత్రి పడుకోబోతూండగా అన్నాడు విజయ్—మధుమూర్తికి విన్పించేటట్లుగా—

'తెలిసినవాళ్ళు తక్కువగా మాట్లాడతారు. కాలాన్ని వ్యర్థ ప్రసంగాలతో పాడు చేసుకోవడం అవివేకుల లక్షణం' అని.

# వెలుగు నీడలు

'మంచిమాటన్నారు విజయ్‌గారూ! రాజకీయాలుకూడా నేర్చుకున్నా రనుకుంటానే మీరు! లేకపోతే యింత పరిజ్ఞానం తేలిగ్గా అలవడదు' అన్నాడు మధుమూర్తి సౌమ్య స్వరంతో.

విజయ్‌కేమని జవాబివ్వాలో స్ఫురించకుండా పోయిందెంతగా ఆలోచించినా. ఊటీలోవున్న పదిరోజాలూ ఆ డాక్టరి హృదయం అసూయతో వుడికిపోయింది. అనుపమమైన అంతులేనంత ఆగ్రహం వచ్చింది. మధుమూర్తిని నమిలి మింగివేయాలన్నంత ద్వేషం; కక్ష పెరిగిపోయాయి మనస్సున.

ప్రతి మాటలోనూ మధుమూర్తిని పరిహసించేవాడు. ఎంతగా రెచ్చగొట్టినా మధుమూర్తి మాత్రం ఆవేశంతో పొంగిపోయి పోట్లాటకు సిద్ధమయ్యేవాడుగాడు. ఏంజెప్పినా మృదువుగా, వుద్రిక్తతలేకుండా చెప్పేవాడు శాంతంగా.

తిరిగి బయలుదేరిన తర్వాత రాజశేఖరం గారన్నారు రైల్లో విజయ్‌కుమార్‌తో.

'తోటిమనిషి మనస్సును గాయపరచడం మనలో బలహీనత వున్నదనీ, మన మనస్సులు సంకుచితమైనవనీ చాటిచెప్పుకోవడమే అవుతుంది. ఆవేశం ఆలోచనల్ని అణిచివేస్తుంది విజయ్!

అసూయ మనిషిని మరీ సంకుచితంగా తయారుజేస్తుంది. మన సంస్కృతి కన్నా మించిన సంస్కృతి వుండవచ్చు. కాని కన్నతల్లిని మరిచిపోగూడదు ఏ పరిస్థితుల్లోనూ.

ఇంగ్లండు బావుంటుందన్నావ్! మంచిదే! కానీ ఇండియా పనికిరాదన్నావ్! నీలో ఆలోచనలేదని తోస్తుందా మాట వినగానే. మామయ్య నిన్ను పరిహసిస్తున్నాడని కోపం దెచ్చుకోకు.

వెన్నెలలోని వెలుగురేఖలంతటా సౌందర్యంగానే భాసిస్తాయి. సౌందర్యం అనంత రూపాలలో సాక్షాత్కరిస్తుంది. సెలయేటి గలగలలలో నవ్వులు విన్పించుతాయి కొందరికి. నదీమతల్లి విన్యాసాలలో కొత్తకొత్త అందాలు కన్పించుతాయి మరికొందరికి. దేని అందం దానిదే. ఒక వస్తువు సౌందర్యాన్ని మరోవస్తువుతో పోల్చి నిర్లక్ష్యం చేయడమంటే సౌందర్యంలోని విలువ తెలియదన్నమాట.'

విజయకుమార్ మౌనంగా వుండిపోయాడంతసేపూ.

ఏలూరురాగానే మధుమూర్తిపేర ఓ టెలిగ్రాం వచ్చివుంది. 'మాధవి కన్పించడం లేదు. వెంటనే బయల్దేరి రావలెను' అని వుంది.

వెంటనే ప్రయాణమై వెళ్ళిపోయాడతడు.

ఇల్లు చేరగానే తల్లి దీనవదనంతో ఎదురైంది మధుమూర్తి మనస్సున ఏదో భావం బొంగరంలా తిరుగుతోంది. తల్లి కళ్ళల్లో గూడుకట్టుకున్న బాధని చూడగానే ఏదో జరగరానిది జరిగిపోయిందని స్పష్టమైపోయింది.

'ఏమైందమ్మా? మాధవికి!' ఆతురతతో ప్రశ్నించాడు.

'ఏమిగాలేదు బాబూ! ముందు నువ్వు కూర్చోయిలా! కాసిని మజ్జిగ త్రాగు' అన్నదామె గంభీరత సడలని స్వరంతో.

'మొన్నటిరాత్రి నుంచి మరీ పిచ్చిగా మాట్లాడుతోంది. మనవూరి డాక్టర్ని పిలిచి చూపించానక్కడికీ. ఫరవాలేదన్నాడాయన. కానీ నిన్న మధ్యాహ్నం! మాధవీ! అన్నం తిను తల్లీ! 'అనగానే' నేనీ యింట్లో వుండనే వుండను. నాకు అన్నం పెడతానంటావా!' అంటూ పెద్దగా కేకలు వేసింది.



కొంత సేపటికి చల్లబడిందా ప్రదేశం. రాత్రి అందరం పడుకున్నాం. మాధవి మంచం ప్రక్కనే నేనూ ప్రక్కవేసుకున్నాను.

అర్ధరాత్రి దాహమై లేచి చూద్దును గదా! మాధవి లేదు. ఏమైందా? అని దీపం పుచ్చుకుని ఇల్లంతా వెదికాను. నౌకర్ని పిలిచి చుట్టుపక్కల వెదికించాను.

కానీ ఎక్కడా కన్పించలేదు నాయనా! స్టేషనుకీ పరుగెత్తించాను కొందర్ని. చివరలో ఓ ఆడమనిషి ఎక్కింది! కాని ఎవరైనదీ చెప్పలేనన్నాడు స్టేషను మాష్టరు. మరావె మాధవేనేమో! ఏం చేయను మధూ!? ఈ వృద్ధాప్యంలో బాధన్నీ చింతలా చీకులే అయిపోయాయి!' అంటూ ఏడవసాగింది.

ఎంతో సేపటివరకు మధుమూర్తి నోట మాటరాలేదు. కనులనుంచి అశ్రుధారలు ప్రవహించసాగినయ్!

అతని హృదయాన్నెవరో ముక్కలు ముక్కలుగా ఖండించుతూన్నట్లు విలవిల లాడిపోయాడు.

తల్లి దుఃఖించుతున్నా వారించలేనంత బలహీనత ఆవహించింది. అక్క, శారద వచ్చి, తమ్ముణ్ణి చూసి కంట నీరెట్టుకుంది.

'ఎవరమూ ఏం చేయలేం! వూరుకో అమ్మా. మాధవికీ—మనకూ యింతవరకే ఋణమేమో!' అంటూ వూరడించాడు కనులు వత్తుకుని.

కానీ మాధవి స్మృతులతో అతని మనస్సు తూట్లు పడిపోతోంది.

'సరే! ఏలూరువెళ్లి పేపర్లో వేయిస్తాను! యిక్కడ వుండిమాత్రం ఏం చేయగలను?' అని వెంటనే ప్రయాణమయ్యాడు తిరిగి.

రైల్లో వున్నంతసేపూ అతని మనస్సు వలలోని చేపలా తన్నుకుంటోంది.

'మాధవీ! నిన్నింత నిర్దాక్షిణ్యంగా భగవంతుడెందుకు శపించాడు!? నాకింత ఘోరమైన శిక్ష ఏనేరానికి విధించాడు?

ఎక్కడని వెదకను? బ్రతుకున బ్రతుకై మనస్సున మనస్సైన మాధవిలేని మధుమూర్తికింకా ఏం మిగిలింది? నీ అనురాగామృతాన్ని అందుకున్న ఇంకా నిర్భాగ్యుణ్ణి ఇంత కఠినంగా శిక్షించి అలా నిర్దయగా ఏదూర తీరాలకి వెళ్లిపోయావ్?

'ఒంటరిగా వుండలేరు మీరు' అన్నావోసారి! కాని నన్నిపుడు ఎలా ఏకాకిగా

చేయగలిగావ్? నీ మనస్సెలా అంగీకరించింది?

నా జీవితాన్ని నీ చేతులలో వుంచుకున్నానే! నిన్నే సర్వస్వంగా భావించుకున్నానే?

'ఛా! ఏదేమిటి? మాధవేం చేయగలదు? శాపంతో శిలా విగ్రహమైపోయిన తనలో యింకా అనుభూతులూ, అనురాగాలూ, సంబంధాలన్నీ ఎలా వుంటాయి?

నాకెక్కినట్లుంది పిచ్చి! అదే హాయిగా వుంటుంది 'పరిస్థితుల్లో' ఆవేదనతో, నిరాశతో అతడు క్రుంగిపోయాడెంతగానో.

ఏలూరు ఎలా చేరుకున్నాడో అతనికే తెలియదు.

సరాసరి పత్రికల వాళ్ళదగ్గరకు వెళ్ళి వివరాలతో, ఫోటోతో ప్రకటనలు ప్రచురించమని కోరాడు. తనకు తెలిసిన చోట్లన్నీ గాలించాడు. అదివరకు వున్న హాస్పిటల్‌కి వెళ్ళి చూశాడు.

తెలిసిన స్నేహితులకూ, పరిచయస్థులకూ జాబులు వ్రాశాడు. రాజశేఖరంగారూ, అనుపమా పరుగున వచ్చారా వార్త వినగానే

'అధైర్యపడకు మధూ! మనం చేయగలిగినంత చేద్దాం! తర్వాత భగవంతుని కృప ఎట్లావుంటే అట్లా జరుగుతుంది' అంటూ ఓదార్చారాయన.

అనుపమకు మధుమూర్తిని చూస్తుంటే మనస్సు నీరైపోతోంది. అతడిని ఏవిధంగా వూరడించాలో, తెలియకుండా పోయింది.

'బొమ్మను చూసుకుని మురిసిపోతున్న అతనికి ఆ అదృష్టం కూడా అందకుండా పోయింది;' అనుకున్న దామె బాధతో వూగిపోతూ.

రాజశేఖరంగారు, అనుపమా, మధుమూర్తిని తీసికొని యింటికి వచ్చారు

నాలుగైదు రోజులవరకూ అతడు పెదవి విప్పలేక పోయాడు

శూన్యంలోకి చూస్తూ వెర్రివాడిలా అస్పష్టంగా తనలోతాను గొణుక్కుంటూండే వాడు.

అనుపమకు భయంవేసేదాతడినా పరిస్థితిలో చూడగానే

'మరీ యింత దిగజారి పోకూడదు మాష్టారూ! ఏం చేయగలం? చెప్పండి;' అన్నదామె అతనిదిగులు చూడలేక.

'అనురాగ బంధాన్నంత సులభంగా

# వెలుగునీడలు

త్రెంచుకోలేం అనుపమా! భగవానుడెందుకిలా నేరంలేకుండా శిక్షిస్తాడో అర్థమవడం లేదు. నిజంగా మాధవి నిర్దాక్షిణ్యంగా శిక్షింపబడింది,' అన్నాడతడు వేదాంతిలా. అనుపమ సహానంవహించింది కావాలనే. మరే మన్నా ఆబాధాతప్త హృదయాన్ని మరింత నలిపి వేసినట్లవుతుందనే మాట్లాడకుండా వుండిపోయింది. నెలరోజులు గడిచిపోయాయి రెండో కాగితం చిరిగిపోయింది కేలెండరులో. కానీ మాధవి జాడేలేదు ఫలానాచోట కన్పించింది' అన్న వార్తేలేదు.

మనస్సును రాయిచేసుకున్నాడతడు చేసేదిలేక కానీ విశ్రాంతి అన్నది మాత్రం దూరమై పోయింది. క్షణమైనా ఆలోచనల్ని మరిచి నిదురించలేక పోతోంది మనస్సు.

'మాధవీ! నిన్ను మరిచిపోలే నేనాటికీ! నీ అనురాగాన్ని అందుకోలేనిక. కానీ నీ స్మృతులుమాత్రం చెరిగిపోవు యీ హృదయాన. నీకోసం జీవించాలనుకున్నానిన్నాళ్ళూ. ఆ ఆశా కరిగిపోయింది జీవితంలో ఏనాడూ తప్పటడుగు వేయకుండా నీ స్మృతులే నిండివున్నాయి నా మనస్సున' అనురాగ పూర్ణమైన అతని హృదయం ఆవేదనతో, ఆలోచనతో వూగిపోతోంది.

రెండు మూడుసార్లు యింటికి వెళ్ళి తల్లికీ, అక్కకూ, బెంగతో కృశించి పోయి చేసే దేమీలేదని తానే ధైర్యం చెప్పి వచ్చాడు.

జీవితాన సర్వస్వాన్నీ కోల్పోయి; తిరిగి మనిషిగా ఏ ఆశతో జీవించుతున్నాడో భగవంతునికే తెలియాలి. కానీ అతని వదనాన విచారరేఖలతో బాటు, మందహాసాంతులు కూడా తళుక్కుమంటూనే వున్నాయి



అంతటి ఆవేదనలోనూ, కర్తవ్యాన్ని మరిచి, బాధ్యతలకు దూరంగానూ పారిపోలేదు విరక్తితో ఆగిపోనూలేదు. మనోవ్యథ వనంలా పెరిగిపోతున్నా ఏ బలహీనతా అతని ఛాయలకైనా చేరలేకపోయింది.

రాజశేఖరం గారెంతగానో ప్రశంసించారతని మనోనిశ్చలతని.

'నిజంగా మనిషిగా నిలబడగలిగేది లేనిదీ దుఃఖంలోనే తేలిపోతుంది. కష్టంలోకూడా మనస్సును నిగ్రహించుకో గలిగినపుడే మనిషి విలువా, ఆత్మవిశ్వాసం వెల్లడవుతాయమ్మా! మానవుడికి తోడునీడగా నిలబడగలవాళ్ళు దూరమైనపుడు దుఃఖం తొలిచివేస్తుంది. క్రుంగదీస్తుంది విరక్తి పెరిగి వూడలువేసి వెర్రి వ్యామోహాల్లోకి లాగుతుంది మనస్సుని. కానీ నిగ్రహం అవసరమైనది ఆ సమయంలోనే. అపుడే వున్నతుడౌతాడు మానవుడు.

అనుపమకూ నిజమే నన్పించింది తండ్రి విమర్శ. అందుకే మధుమూర్తిపైన ఎనలేని గౌరవానురాగాలు జనించాయి ఆక్షణం నుంచీ. అభిమానం కొండలా పెరిగిపోయింది. అతడు వున్నతస్థానం ఆక్రమించాడామె వూహల మందిరాన. దివ్యజ్యోతిలా వెలిగిపోతోం దతనిపైన అనురాగం.

శారద, తమ్ముడు మధుమూర్తికి జాబు వ్రాస్తుంది ఎపుడూ తల్లే వ్రాస్తుంది ఏ అవసరం వచ్చినా. 'అక్కయ్య వ్రాసిందేమిటా?' అని కుతూహలంతో విప్పాడా లేఖని.

ప్రియమైన తమ్మునికి—

అక్కయ్య దీవించుతూ, నీ భావిజీవితం యికనైనా ఓ తీరానికి చేరాలని భగవానుని ప్రార్థిస్తూ వ్రాయులేఖాంశాలు—

అమ్మకింక యీ జీవితసంధ్యా సమయాన ఏమాత్రపు బరువుని మోయడానికీ ఓపిక లేదుమధూ! ఏ క్షణాన వదుం కట్టుకుందోగానీ యింతవరకూ కంటి నిండుగా కునుకైనాపట్టిన క్షణంలేదు. నా బ్రతుకు బండలైపోయింది. దుఃఖం తప్ప ఏమీలేదునాకు. కానీ నీ జీవితం కూడా సౌఖ్యానికి దూరమై పోయినందుకు నాగుండెలు తరుక్కుపోతున్నాయి.

వెన్నెలతో నిండిపోవలసిన నా తమ్ముడి బ్రతుకు నవ్వున్నవన్నీ సమస్యలే అనుకోగానే విలవిల లాడిపోతోందీ అక్కయ్య మనస్సు.

కలలా మిగిలిపోయింది మాధవి నీ జీవితాన అలలా కరిగిపోయింది. కాలగర్భాన.

ఆకలతోనే నీ భవిష్యత్తు ఆగిపోవడం భరించలేదురా! మధూ! యీ నీ అక్కయ్య.

అమావాస్య వచ్చింది. వెళ్ళిపోయింది. పున్నమీ వస్తుంది వెన్నెలా పండుతుంది.

జీవితంలో ఆశలు అంతస్థుల్ని నిర్మించుకుంటాయి.

ఏ అంతస్థున ఆనందం అందుతుందో! అంతవరకూ అల్లుకు పోవలసిందే జీవనలత.

అనురాగంతో నవ్వులు పండించుకో! ఆనందాన్ని అందుకుని ఆదర్శ శిఖరంగా నిలిచిపో!

అదే నీ అక్కయ్యకోరిక. అమ్మ మనస్సునవున్న ఆశాదీపిక. బావగారు మద్రాసులో వున్నారని, పెదమామయ్య చెప్పారు. నీ స్నేహితుడు రావానికి కన్పించారట. అతనికి జాబ్రాసి కనుక్కో. వీలుంటే ఓ సారి శ్రమ అనుకోక యీ అక్కయ్య కోసం వెళ్ళిరా!

నీ జీవితాన సుఖం నిండాలని
కోరుతూన్న
అక్కయ్య — శారద.'

నవ్వుకున్నాడు విరక్తిగా మధుమూర్తి ఆ లేఖ చదవగానే.

'ఎందుకు అక్కయ్యా? నీకింత అనురాగం! యీ తమ్ముడిపైన!' అనుకున్నాడామె మమతను తలచుకుంటూ.

మరునాడే స్నేహితుడికి జాబు వ్రాసి మూడోరోజున మద్రాసు బయల్దేరాడు. వెళ్తున్నట్లు అనుపమకు ఫోను చేయబోయాడు. కానీ అప్పుడామె కాలేజికి వెళ్ళిపోవడంచేత ఆ వార్త అందనేలేదు.

ఆఫీసు పని తొందరలో మరలా ఫోను చేయడమూ పడలేదు. ఓసారి వెళ్ళిరావాలనుకున్నా తీరికా లభించకుండాపోయింది.

నాలుగైదురోజులు గడిచాయి.

అనుపమ, తండ్రినడిగింది 'మధుమూర్తి కన్పించారా?' అని. లేదన్నారాయన. ఆశ్చర్యంతోపాటు కించిత్ కోపం కూడా కలిగిందామెకు, మధుమూర్తి జాడైనా తెలియనందుకు.

ఆ రాత్రి విజయ్‌కుమార్ వస్తూనే అనుపమను పిలిచాడు. రాజశేఖరంగారితో మాట్లాడుతూ మధ్యలో అన్నాడు —

'మధుమూర్తిగారు పెళ్ళి జేసికుంటారట! అందుకే మద్రాసు వెళ్ళారట.'

అనుపమ నిర్ఘాంతపోయింది. విజయ్ వంక సూటిగా చూసింది.

'నారదుడిలా కలహాభోజనుడన్న బిరుదు కావాలేమిటి బావా?' అన్నది నమ్మలేక.

'నువ్వే బిరుదు యిచ్చినా నేనన్నమాట మాత్రం నిజం అనూ! రెండురోజులాగు. నీకే తెలుస్తుంది!'

'మరి మద్రాసు వెళ్ళడమేమిటి?' అయోమయంగా వుందామెకు.

'ఓ స్నేహితుడి చెల్లెలట! పేరూ...ఆ...శశికళ అన్నారు. ఇక్కడే టీచరు వుద్యోగం చేస్తోందట. ఆ స్నేహితుడిది మద్రాసు. అందుకు వెళ్ళాడు!'

'ఏమిటి నాన్నా? నిజమేనా?' వణుకుతూన్న కంఠంతో ప్రశ్నించింది.

'ఏమోనమ్మా! మరి నాతో మాటవరుసకైనా అనలేదే! రానివ్వు! తెలుస్తుంది. మంచి వార్తేగా! తొందరపడడం ఎందుకు?'

అనుపమ గుండెలనెవరో ముక్కలు చేస్తున్నట్లయి పోయింది కట్టుకున్న కలల మేడ పునాదులతోసహా కూలిపోయిందనుకున్నది.

ఆ రాత్రంతా సందేహాలతో, నిరాశతో వూగిపోయిందామె మనస్సు.

మాష్టారి మనస్సు యింతలోనే మాధవిని మరచి పోయిందా? అనుపమను కాదనుకున్నారా? అందుకే చెప్పకుండా వెళ్ళిపోయారేమో! బావనాటకం ఆడటంలేదు గదా!

అంత అనురాగం పొంగి ప్రవహించుతూన్న ఆయన హృదయం యింతలోనే మరోమలుపు తిరుగుతుందా? ఏమో? ఎవరు చెప్పగలరు? మనస్సుపోయే పోకడలు చిత్రంగా వుంటాయి. మాష్టారు మాత్రం మనిషిగాదా? అందీ అందని మమకారపు మబ్బులచాటున ఎన్నియుగాలని సుఖాన్ని అన్వేషించగలరు?!

నాన్న అంగీకరించరని తెలిసికోలేనంత అజ్ఞానిగాదుగా ఆయన! అంతస్థుల భేదాలున్నాయని చెప్పారుగా?

ఈ ప్రేమ ఓ మహా ప్రవాహం! ఎప్పుడే మలుపులో పొంగిపోతుందో తెలియదు. ఏ లోయలో నిలిచిపోతుందో ఎవరికెరుక?!. అనురాగం మనుష్యుల్ని జయిస్తుంది నాన్నగారన్నట్లు.

మాష్టారుకూడా ఓడిపోయారేమో ఆ అనురాగ బంధానికి? ఎవరా శశికళ?! ఎక్కడినుంచి వూడిపడింది వున్నట్లుండి యిపుడు?! ఇన్నాళ్ళెక్కడవుందో?

ఇదంతా నిజమేనా? కలలావుందే?! 'ఆమె వూహలు కలలై, ఆ కలల్లోకి జారిపోయిందామె. ఏ ఝాముకో అకలలతో నిదురకూడా ఓ మాయలా ఆవరించుకుంది.

(ఇంకా వుంది)

రాత్రికి వంటేమిటో చెప్పండి
నేనూ ఇంటికెపోతాను



# 'ధర్మపథం'
# గోవు యొక్క విలువ



బులుసు వేంకటరమణయ్య

సాధువైన జంతువులలో గోవుదే ఉత్తమ స్థానం. సంసారులకేకాకుండా సన్యాసులకు కూడా అది మిక్కిలి అవసరం. అదిలేనిదే దినం గడవడమే కష్టం! అందువల్లనూ దాని సాధుత్వంమూలాననూ దానికి ఎంతో విలువ ఏర్పడింది.

ఈ విషయాన్ని వివరించే ఒక ఇతిహాసం ఉన్నది—

చ్యవనుడు ఒక మహాముని. జలస్తంభనాది మహావిద్యలు ఎరిగిన మహనీయుడు. ఆయన ఒకప్పుడు గంగా యమునా సంగమంలో నీటిలో మునిగి, అక్కడి జలచరాలలో కలిసిపోయి, అక్కడే తపస్సు చేసుకొంటూ ఉండేవాడు.

ఒకనాడు కొందరు జాలరులు చేపలను పట్టాడ్డానికి అక్కడికివచ్చి వలలువేశారు. కొన్నిచేపలతోపాటు ఆ మహాముని కూడా వలలో చిక్కుకున్నాడు. జాలరులు ఆ వలను బయటికి లాగేటప్పుడు ఎంతో బరువు తోచింది. ఏదో పెద్దచేప వలలో చిక్కిందనీ, దాన్ని అమ్మితే ఎంతో సొమ్ము లభిస్తుందనీ వాళ్ళు మొదట చాలా సంతోషించారు. కానీ, తీరా వలను బయటికి లాగితే వారి ఆశ నిరాశ అయింది. అంతే కాదు. ఎంతో భయం కలిగింది జలస్తంభనచేసి, నీటిలో యోగనిష్ఠలోవుండిన మహామునికి అపచారంచెయ్యడంవల్ల ఆయన కోపించి యేమి శాపం యిస్తాడో అని వణికిపోయారు.

వాళ్ళసంగతిని గ్రహించి ఆ మహాముని అన్నాడుగదా—

'నాయనలారా! మీరేమీ భయపడకండి. ఇందులో మీతప్పు యేమీలేదు. వలలువేసి జలచరాలనుపట్టి జీవయాత్ర గడపడం మీవృత్తి. వృత్తిధర్మాన్ని నిర్వహించిన మీవల్ల దోషంలేదు. చేపలను అమ్ముకొనేవిధంగా నన్నుకూడా అమ్ముకోండి' అని. మహామునిని అమ్ముకోవడం తమకు ఇష్టంలేదని వాళ్ళు ఎంతచెప్పినా ఆయన వినలేదు ఏమీ తోచకవాళ్ళు రాజైన నహుషుడి దగ్గరకుపోయి యీ సమాచారం తెలియజేశారు.

మహామునిపట్ల తనరాజ్యంలో అపచారం జరిగిందని రాజు కలతపడి వెంటనే జాలరులతో ముని ఉన్నచోటికివచ్చి, అపచారాన్ని క్షమించవలెనని ఆయనను ప్రార్థించాడు. 'ఇందులో ఎవ్వరి తప్పూ లేదు. నా విలువను జాలరులకు ఇస్తే సరి' అని ఆయన అన్నాడు. రాజు వెయ్యి మాడలు ఇస్తానన్నాడు. మునినవ్వుతూ 'నా విలువ యింతేనా?' అన్నాడు. తర్వాత నహుషుడు క్రమంగా విలువను పెంచి పది వేలు—లక్ష—చివరకు కోటిమాడలు ఇస్తానన్నాడు. న్యాయంగా ఆలోచించి నిర్ణయించాలని చ్యవనుడు అన్నాడు. నా రాజ్యంలో సగం యిచ్చివేస్తా'నన్నాడు నహుషుడు. మహాముని 'రాజా! నీవు నగరానికిపోయి మంత్రులతో ఆలోచించి నిర్ణయించు' అని చెప్పగా రాజు నగరానికి తిరిగివచ్చివేశాడు.

మంత్రులుకూడా ఏమీ ఆలోచన చెప్పలేక పోయారు. రాజు చాలా విచారంతో ఏమీతోచక దిగులుపడిపోయాడు. ఆ సమయంలో అదృష్టవశాత్తూ తలవని తలంపుగా గవిజాతుడనే మహాముని అక్కడికి వచ్చాడు. నహుషుడు ఈ సమాచారాన్ని అతనికి విన్నవించి, తన్ను ఈ చిక్కులో నుండి తప్పించవలెనని ప్రార్థించాడు.

ఆ ముని క్షణంమాత్రం ఆలోచించి 'ఓ రాజా! ధనంతోనూ, రాజ్య సంపదలతోనూ మహామునుల విలువను నిర్ణయించడం పొరపాటు. వారి దృష్టిలో ఇవన్నీ తృణప్రాయాలు. పరోపకార పరాయణతలోనూ, సాధుత్వంలోను గోవులే మునులకు ఈడైనవి. అందువల్ల నీవు ఒక ఉత్తమ ధేనువును చ్యవనుని విలువగా జాలరులకు ఇయ్యవలసినది. ఆ మహాముని ఎంతో తృప్తి పొందుతాడు' అని సలహా చెప్పాడు.

నహుషుడు వెంటనే ఒక చక్కనిగోవును తీసుకొని చ్యవనుడి వద్దకుపోయి, ఆగోవును సమర్పించాడు. రాజు తన భావాన్ని గ్రహించినందులకు ఆ మహాముని చాలా సంతోషించి, తనకు బదులుగా ఆ గోవును జాలరులకు ఇచ్చివేశాడు.

ఆ జాలరులున్నూ 'మహాత్మా! మీరు కోరినట్లు మీ విలువగా ఈ గోవును — మారుమాట చెప్పకుండా మేము తీసుకున్నాము. ఈ గోవు మా సొంతమయింది కదా!

దీన్ని యిప్పుడు మేము మీకు భక్తితో సమర్పిస్తున్నాం. మా ప్రార్థనను అంగీకరించి దీన్ని తప్పకుండా స్వీకరించాలి' అని ప్రాధేయపడ్డారు.

వాళ్ళ కోరికను కాదని తిరస్కరించడం భావ్యంకాదని చ్యవనుడు ఆధేనువును స్వీకరించాడు.

లోకంలో మహర్షులు గొప్పవారు! వారికి గోవు ప్రత్యామ్నాయంగా ఉన్నది కావున ధేనువు మహర్షితో సమానమైనది!



# యమలోక యాత్ర

యమ్.యస్.అడివి కృష్ణారావు



వెంకట్రావు చచ్చిపోయాడు. కొరవ లేకుండా పూర్తిగా చనిపోయాడు. అతని శవాన్ని పోలీసులు తీసుక పోతున్నారు. వెంకట్రావు ఆత్మ దిగులుతో ఆ దేహం వెంబడే వెళ్లసాగింది. అతని దిగులుకు కారణం; ఈ పోలీసులు అందరిలా తను ధరించిన దేహాన్ని ఖననం చెయ్యరు, లేక పోతే కాల్చరు. దాన్ని డాక్టర్ దగ్గరకు పంపి ఏ ముక్కకా ముక్క కోసి, ముక్కలు ముక్కలు చేసి, ఆ ముక్కలను మళ్లీ కుట్టి, మూనెలో పెట్టి, శవాల రూములోకి నెట్టి తరువాత బూడిద చేస్తారు. ఇదంతా తలుచుకుంటుంటే అతనికి బాధగా ఉంది. తను అల్లారు ముద్దుగా 25 సంవత్సరాలు అద్దెకు తీసుకున్న ఆ యింటిని అలా ముక్కలు చేస్తుంటే అతని అంతరాత్మ (అంటె అతనే) ముక్కలు ముక్కలుగా నరికి వేయబడ్డట్టు ఫీలయినాడు. తను ఆ అద్దె శరీరానికి ఎంత రిపేరు చేశాడు! ఎన్నిసార్లు సబ్బులేసి తోమాడు! ఎంత శుభ్రంగా ఉంచాడు! ఎన్ని రకాల బట్టలు తొడిగాడు! అన్నీ తలుచుకుంటే వెంకట్రావు ఆత్మ విలపించింది. మళ్లీ ఆ శరీరంలోకి దూరాలనుకున్నాడు. కాని ఎక్కడా సందు కనిపించలేదు తాను శరీరంలోంచి ఎలా బయటకు వచ్చిందీ గుర్తు లేదు శరీరంలోకి దూరాలని ఎంత ప్రయత్నం చేసినా సాధ్యం కాలేదు. చేసేది లేక పోలీసుల వెంబడి; అద్దె కొంప వెంబడీ వెళ్లసాగాడు. మధ్య దార్లో పోలీసులు తనను గురించి ఏదో మాట్లాడుకుంటున్నారు. వాళ్లు ఏం మాట్లాడుకుంటున్నారో శ్రద్ధగా వినాలని, చెవులు రిక్కించి వాళ్ల మాటలు వినసాగాడు.

'మన ఖర్మ కాలి సబ్ఇన్‌స్పెక్టర్ ఈ శవాన్ని మన మెడకు తగిలించారు. దీనితో ఎంత గొడవపడాలి. ఎన్ని కష్టాలు. వీడు చావటం కాదుకాని మనల్ని చంపుకు తింటున్నాడు. వీణ్ని తగలబెట్ట!' అనాడాక పోలీసు.

అతను అన్ని తిట్టినా ఆ చివరి మాటలు వెంకట్రావుకు అమృతప్రాయంగా తోచాయ్. తనకు కావలసింది అదే. తన దేహాన్ని ఎండబెట్టకుండా తగలబెట్టటం.

'అయినా ఆత్మహత్య చేసుకుండే వెధవ ఏ నిర్మానుష్యమైన ప్రదేశంలోనో చేసుకోక మన దుంప తెంచటానికి మునిసిపాలిటీపార్కు బావిలోనే పడి చావాలా! ఇప్పుడు వీడితో మనకు ఎంత పేచి వచ్చి పడింది. ఈ ఆత్మహత్య చేసుకునే వాళ్లంతా ఇంతే! హాయిగా ఏ అరణ్యాలకో పోయి చావక పట్టణాలలో చచ్చి మన దుంప తెంచుతున్నారు.' అన్నాడు రెండో పోలీసు.

వెంకట్రావు పొట్టనుండి గొంతు వరకు ఆగ్రహంతోను మెదడంతా ఆశ్చర్యంతోనూ నిండిపోయాడు. తను ఆత్మహత్య చేసుకున్నాడా? అంతా అబద్ధం. తను దైవఘటన వలన చనిపోయాడు నిజంగా మాట్లాడితే దేవుడే తనను హత్య చేశాడు. తను హత్య (దేవుని చేత) చేయబడితే వీళ్లు ఆత్మహత్య అంటారేమిటి? వీళ్లేమన్నా తాగి ఉన్నారా? తనకు వీలైతే వాళ్లిద్దర్ని చచ్చేంత వరకు తందామనుకున్నాడు. కాని తనకా శక్తి లేదుగా కారణం తనే చచ్చి పోయాడు.

తరువాత నిజం ఆలోచించేసరికి అతనికి, వాళ్లమీద ఆగ్రహం పోయి జాలి కలిగింది అవును పాపం, వాళ్లకు మాత్రం ఏం తెలుసు. ప్రమాదవశాత్తు చనిపోయానని మొన్నటి వరకూ నిరాశతో తిరిగిన తను ఇవాళ భావిలో పడి చచ్చిపోయాడంటే ఆత్మహత్య కాక మరేమనుకుంటారు? అసలు తను ఆత్మహత్య చేసుకున్నానని తన స్నేహితులే వాళ్లకు

చెప్పారు. వాళ్ళ మాటలను విళ్ళు నమ్మారు.

అయినా వాళ్ళు చెప్పగానే నమ్మటమేనా? నిజం విచారించ నక్కర్లేదా? తనను గురించి పూర్తిగా తెలుసుకుంటే తను ప్రమాదవశాత్తు చనిపోయాడో లేక ఆత్మహత్య చేసుకున్నాడో వాళ్ళకు తెలిసేది. అసలీ పోలీసులలో చాలా మంది ప్రజలేది చెపితే అది గట్టిగా నమ్ముతారు

ఆస్పత్రి గేటు దగ్గరకు వచ్చింది జీపు ఆస్పత్రి గేటు వద్దనుండి భవనానికి సుమారు మూడు ఫర్లాంగుల దూరముంటుంది. ఆ భవనానికి వెనకవైపే స్మశానం ఉంది. భవనానికి దారితీసే ఆ రోడ్డుకు డాక్టరు 'సేఫ్టీరోడ్' అని పేరుపెట్టాడు. కాని కొందరు దుండగులు దానికి 'ఒన్వే ట్రాఫిక్ రోడ్' అని నామకరణం చేశారు వాళ్ళ ప్రచారంవల్ల తేలిన సారాంశం ఏమిటంటే ఆ ఆస్పత్రిలోకి రోగులు పోవటమే కాని తిరిగిరావడమంటూ ఉండదు ఎందుకంటే, ఆస్పత్రికి వెనుకవైపే స్మశానం ఉందికదా!

తన శరీరాన్ని ఆ డాక్టరు దగ్గరకు తీసుకు వెళుతున్నారని తెలియగానే వెంకట్రావుకు దిగులేసింది పడక పడక ఈ డాక్టరు చేతుల్లోనే పడ్డాను అనుకున్నాడు. అసలు ఇటువంటి డాక్టరును గవర్నమెంటు డాక్టరుగా ఎలా నియమించారా అన్న పెద్ద సందేహమొచ్చింది కాని ఇప్పుడన్ని సందేహాలు వస్తేమాత్రం ఏంలాభం? చేసేదిలేక యథాప్రకారం శరీరాన్ని అనుసరించ సాగాడు. లోపలికి వెళ్ళగానే వెంకట్రావుకు ఒక కొత్త వార్త తెలిసింది. డాక్టరు ఆ ఉదయం ఊరికి వెళ్ళాడుట. ఇంకో గంటలో రావచ్చు!

అంటే తనశరీరం ఇంకొక నాలుగు గంటలలో బూడిద కాబోతున్నది. ఇంకా 240 నిమిషాలు మాత్రమే మిగిలుంది. ఉద్యోగంచేస్తూ, పెళ్ళిచేసుకొని హాయిగా కాలం గడపవలసిన తను ఇలా అర్ధాంతరంగా ఎందుకు చనిపోయాడు. ఆ ఊహ మనస్సులో మెదలగానే వెంకట్రావుకు మళ్ళీ బ్రతకాలనిపించింది. ఎలాగైనా సరే యమధర్మరాజును ఒప్పించి - మళ్ళా బ్రతకాలి

ఇలా ఆలోచిస్తూ తిరుగుతున్న వెంకట్రావుకు దూరాన్నించి ఇద్దరు వ్యక్తులు

# యమలోకయాత్ర

తనను చూస్తూ, తనవైపే వస్తున్నట్లు కనబడ్డారు. వెంకట్రావుకు బోలెడంత ఆశ్చర్యం ముంచుకొచ్చింది—తను రూపం లేనివాడు కదా? తనను ఎవ్వరూ మానవులు చూడలేరే! వీళ్ళిలా చూస్తున్నారు? అనుకున్నాడు ఆ ఇద్దరినీ తేరిపారా చూశాడు. ఇద్దరూ నల్లని వికారమైన దుస్తుల్లో ఉన్నారు. ఇద్దరి తలపైనా కొమ్ములున్నాయ్. ఇద్దరి చేతుల్లోనూ పూర్వం రాజుల దగ్గరుండే ఆయుధాల్లాంటివి ఉన్నాయ్ బాగా దగ్గరకు వచ్చిన వాళ్ళను చూశేసరికి అతను ఝల్లుమన్నాడు వాళ్ళు యమదూతలు. తనను తీసుక వెళ్ళటానికి వచ్చారు. నరకానికి తీసుకు వెళ్ళటానికి వచ్చారు వెంకట్రావు తనకు తాను ధైర్యం చెప్పుకున్నాడు ధైర్యంగా ఉండాలనుకున్నాడు 'ధైర్యే, సాహసే ప్రాణః' అనుకున్నాడు.

'ఏయ్ అబ్బాయ్! నీపేరేనా వెంకట్రావు' అనడిగారు వాళ్ళు.

'అవును' ధైర్యంగా చెప్పాడు.

'నీ కోసం ఊరంతా గాలించి చచ్చాం. కాదు కాదు వచ్చాం. నువ్విక్కడున్నావా? అయినా చచ్చినవాడివి చచ్చినచోటే ఉండక ఊరంతా తిరగటం దేనికి! బుద్ధిలేదు' అన్నారు వాళ్ళు

వెంకట్రావుఆత్మ ఆగ్రహంలో మునిగిపోయింది. ఎంత చస్తేమాత్రం ఇంత మాటంటారా! వాళ్ళను నమిలేశాలా చూశాడు. ఆత్మ వేడెక్కిపోయింది. బుస కొట్ట సాగాడు అదేమాట ఈ లోకంలో అంటే, వాడెంత పెద్ద ఆపీసరైనా సరే మనంచేసింది తప్పు ఐనాసరే వాడిచేతక్షమాపణ చెప్పిస్తాం కాని వీళ్ళు యమభటులుకదా అనుకున్నాడు వెంకట్రావు అందుకని తన కోపాన్ని తనలోనే ఇముడ్చుకున్నాడు. అందుకని శాంతంగా మాట్లాడాడు.

'మీరు నాకోసం వెతికారు బాగానే ఉంది కాని కనపడకపోతే అది నాదోషం కాదు మీ దోషమే. ఎందుకంటే మీ డ్యూటీయే వెదకటంకదా'.

ఆ ఇద్దరూ క్వొశ్చెన్ మార్కు మొహాలేశారు

'ఎందుకలా చూస్తారు. నేనడిగిన దానికి జవాబు చెప్పరేం' కొంచెం కోపంగా అడిగాడు.

ఈ సారికోపం యమదూతల వంతైంది. ఈ నరమానవుడు మనల్ని గద్దించి అడుగుతున్నాడే! వీడికెంత ధైర్యం. అయినా అతనడిగిన ప్రశ్న వీళ్ళకు అర్థంకాలేదు. వాళ్ళు తమ పని మరిచిపోయి అతడడిగిన ప్రశ్నకు అర్థం ఏమిటో తెలుసుకోవాలన్న ఆదుర్దా పడసాగారు.

'నీవడిగిన ప్రశ్న మాకు కొద్దిగా అర్థం కాలేదు. అందులో డ్యూటీ అన్నావే. దానికి అర్థం ఏమిటి?' అన్నారు.

'డ్యూటీ అంటే తెలియదా? అది ఆంగ్ల భాష. దాని అర్థం మీ పని చచ్చిన వాళ్ళను పైకి తీసుకుపోవడమే కదా! మీ పనే మీరు చెయ్యటానికి ఇంత బద్ధకమా ఇదే ఈ లోకంలో ఐతే పెనాల్టీ వేస్తారు.'

ఆ మాటలో వాళ్ళకు కోపంతోపాటు వాళ్ళ డ్యూటీ గుర్తుకు వచ్చింది.

'మా పనేమిటో మాకు తెలుసు. నీవు నోరుమూసుకుని మాతోరా!' అని జబ్బ పట్టుకున్నారు

ఇంక తనపని ఆఖరనుకున్నాడు వెంకట్రావు. అయినా చివరిసారిగా వీళ్ళెంత ధైర్యవంతులో చూడాలనుకున్నాడు. జబ్బ పట్టునుండి విడిపించుకుంటూ, ధైర్యంగ, 'రాకపోతే ఏం చేస్తారు' అని అడిగాడు.

యమదూతలు కొద్దిగా భయపడ్డారు. వీడి వాలకంచూస్తే తన్నేట్టున్నాడు వాళ్ళు ఈ పూరికి కొత్త వెంకట్రావు వాళ్ళ లెక్కలో నాలుగవవాడు ఇదవరకటి ముగ్గురు ముసలివాళ్ళు. తమను చూడగానే అదిరిపోయి తాము ఏం చెప్తే అది చేశారు. వీడు కొంచెం పెడసరంగా ఉన్నాడు. ఏం చెప్పాలో వాళ్ళకు తోచలేదు.

వాళ్ళ మనసులోని భావాలను ముఖంపై చూచిన వెంకట్రావుకు వాళ్ళ మనస్తత్వం పూర్తిగా తెలిసింది. వీళ్ళు పేరుకు మాత్రం యమదూతలేకాని పిరికివాళ్ళు. తను బెదిరిస్తే లొంగుతారు. అయినా తన అదృష్టమో, ఖర్మమోగాని తనకు అందరూ డ్యూటీ సరిగా చెయ్యలేని వాళ్ళే చిక్కుతున్నారు. ఆ పోలీసులూ అంతే. వీళ్ళూ అంతే. వీళ్ళను ఒక ఆట ఆడించాలనుకున్నాడు.

'ఏం! చెప్పరేం! రాకపోతే ఏం చేస్తారు'

ఈ సారి జబర్దస్తీగానే అడిగాడు.

'ఏం చేస్తాము! ఈడ్చుకొని లాక్కు వెళతాం' బింకంగా అన్నారిద్దరూ.

'నేను మీకు చిక్కితేగదా' పరుగు పుచ్చుకొన్నాడు వెంకట్రావు యమదూతలు ఒక్కక్షణంపాటు తెల్లబోయి వెంబడి బడసాగారు ఆస్పత్రి చుట్టూ పది ప్రదక్షిణాలు చేశాడు వెంకట్రావు. యమదూతలకు అసలే బియ్యంగా ఉంది ఇంకొక నాలుగు ఘడియలు ఆలశ్యమైతే తమ ఉద్యోగాలు ఊడిపోతాయి. ఆ భయంతో వాళ్ళ అసలే పరిగెత్తలేకపోయారు వాళ్ళ స్థితి కనిపెట్టిన వెంకట్రావుకు వాళ్ళ మీద జాలివేసింది చివరకు అలసిపోయి ఒకచోట చతికిలబడ్డారు యమదూతలిద్దరూ రొప్పుకుంటూ అతని వద్దకు వచ్చారు. వర్షం పడటానికి సిద్ధంగాఉన్న మబ్బుల్లా ఉన్నాయి వాళ్ళమొహాలు ఠాలనగా చెప్పాడు వెంకట్రావు వాళ్ళకు!

'అబ్బాయిలూ! మీరు బెదిరిస్తే మాత్రం నేనురాను నేను అందరిలాంటి వాడినికాను మర్యాద యిచ్చి పుచ్చుకోండి లేకపోతే పుచ్చుకొని యివ్వండి. అనవసరంగా ఎందుకు ఆయాసపడతారు నా దగ్గర డబ్బులుంటే చెరొక సోడా ఇప్పించే వాణ్ణే కాని నాకే లేకపోతే మీకేం ఇప్పించనూ! మీ యిష్టం వచ్చినట్లు జబర్దస్తీ చేస్తే మాత్రం నే ను రా ను బె ది రిం చా రా ఏమూలకో పోయి దాక్కుంటాను మీరు నన్ను ఏలాగూ పట్టుకోలేరు అప్పుడు మీ ఉద్యోగాలు గోవింద కొడతాయి. మీరు చూడబోతే మరీ బీదవాళ్ళలా ఉన్నారు కనీసం చిన్న 'బంకు' అయినా పెట్టుకోటానికి స్తోమతు ఉన్నట్టులేదు అప్పుడు ఆకలితో మాడి చావవలసి వస్తుంది ఆకలితో మాడటం ఎంతో బాధ. మీరు చాలా సుకుమారుల్లా ఉన్నారు ఆ బాధలను ఓర్చుకోలేరు మీకు ఆకలిబాధ లేకుండా ఉండాలంటే మీ ఉద్యోగాలు మీకుండాలి. మీ ఉద్యోగాలు మీకుండాలి అంటె మీ పనులు సక్రమంగా చేయాలి. మీపనులు సక్రమంగా చేయాలి అంటే నన్ను పైకి తీసుకు పోవాలి. నన్ను పైకితీసుకు పోవాలి అంటే నే చెప్పినట్లు వినాలి చూశారా మరి! మీకు ఆకలిబాధ తప్పాలంటే నే చెప్పినట్లు వినాలి. ఆలోచించుకోండి ఆరోహణా, అవరోహణా లెక్కల్లాగా విడమర్చాడు వెంకట్రావు.

'బాబ్బాబు! నువ్వు చెప్పినట్లే వింటాం. మా ఉద్యోగాలు నీ చేతులో ఉన్నాయ్. మాతోరా' వినయంగా విన్నవించుకున్నారు.

'అలారండి దారికి. నాపేరు వెంకట్రావు మీ పేర్లేమిటి' అని అడిగాడు.

'నాపేరు లంబూ. వీడిపేరు జంబూ' అందులో ఒకడు చెప్పాడు.

'ఇవేదో సినిమా పేర్లలా ఉన్నాయ్. అయినా ఎందుకులే, గ్లాడ్ టూ మీట్ యూ!' అంటూ చేయిచాపాడు

'మా కత్తులు నీకు దేనికి?' చాచిన చేయివంక చూస్తూ అడిగారు అనుమానంగా.

'మీ కత్తులు ఎవరడిగారు — ఓహో మీకు ఇంగ్లీషు రాదుకదూ ఖర్మ అయ్యా! లంబూ, జంబూ మీ కత్తులు నేనడగలేదు. మీ పరిచయమైంది అందుకు నేను చాలా' సంతోషిస్తున్నాను అని అభినందనలు తెలుపుతున్నాను ఆ ఇంగ్లీషు పదానికి అలా చేయి చాచటానికి అదీ అర్థం మీకు ఇంగ్లీషు రాకపోవడం పెద్దచిక్కే. తెలుగువాళ్లలో చదువురాని వాడు వచ్చినవాడు అంతా ఇంగ్లీషే ఎక్కువ ఉపయోగిస్తుంటారు తెలుగులో మాట్లాడటం నామర్దా అనుకుంటారు' మరి మీ మహారాజుగారు, అంటే వారే యమధర్మరాజుగారు! వారడిగే ప్రశ్నలకు పాపులు జవాబులు చెప్తారుకదా! దాంట్లో ఇంగ్లీషే ఎక్కువ ఉంటుంది. మరి వారికి, మీకు ఎలా అర్థమవుతుంది' త్వ




సందేహాన్ని వ్యక్తపరిచాడు.

'అవును స్వామీ! ఈ మధ్య అంటే దాదాపు 150 సంవత్సరాలనుండి అందరూ అదేభాష ఆ ఇంగిలీషు మాట్లాడుతుంటే రాజుగారికి అర్థంకాక ఏక లాభం లేదని ఈ లోకంలోంచి ఒకదొరగారిని పిలిపించి ఇంగ్లీషు నేర్చుకున్నారు దాని కోసం కుబేరుని వారిదగ్గరనుండి వెయ్యి వెండిరూకలు అప్పు తీసుకున్నారు. చదువు పూర్తి కాగనే అతనిని మళ్ళీ భూలోకంలో వదిలిపెట్టారు' అని తక్కున ఆగిపోయి మళ్ళీ కంగారుతో చెప్పాడు లంబూ.

'బాబూ! ఇప్పటికే చాలా ఆలశ్యమయింది త్వరగా రాకపోతే మా ఉద్యోగాలు ఊడిపోతాయ్' అని తొందరపడసాగారు

ముగ్గురూ గగనవీధులలో బయలుదేరారు దారిలో వెంకట్రావు అడిగాడు.

'అయితే మీవి టెంపొరరీ జాబ్సా?'

'అదిగో మళ్ళీ ఇంగ్లీషు మొదలు పెట్టావ్'

'ఓహో! మరచిపోయాను మీ ఉద్యోగాలు తాత్కాలికమైనవా?'

'మరేనండి మేము చేరి ఇప్పటికి నూరు పితృదినాలే అయింది కనీసం 500 పితృదినాలైనా లేనిది ఖాయం కాదు'

'పితృదినమంటే ఎన్ని రోజులు?'

'పితృ దినమంటే తెలియదా? భూలోక లెక్క ప్రకారం ఒక పితృ దినమంటే ఒక సంవత్సరం' అన్నాడు జంబు

'పితృ దినమంటే తెలియని వాళ్ళున్నారా' అడిగాడు జంబు

'అంతకు మించిన వాళ్ళున్నారు 'దేవుడున్నాడా' అనే వాళ్ళు కూడా ఉన్నారు' అన్నాడు వెంకట్రావు.

'ఔరా!' అని ఆగిపోయి ముక్కుమీద వేలేసుకున్నారిద్దరూ ఒకేసారి

వేసుకున్న వేలు తీసేలోపల నరక ద్వారాలు సమీపించాయి. వెంకట్రావు ఒక్కసారి దేవుణ్ని స్మరించుకున్నాడు. నరక ద్వారాలు దాటగానే ముందు వైతరణీ నది కనిపించింది. అది చూడటానికి అసహ్యంగా ఉంది అందులో ఉండే జనం పన్నెండు పుష్కరాలకు ఎంత మంది వస్తారో అంతకు పైనే ఉన్నారు.

అందరూ బాధతో మూలుగుతున్నారు. వాళ్ళను చూసేసరికి వెంకట్రావుకు జాలితో పాటు భయం పుట్టింది. తను యమధర్మరాజుతో చేసే వాదనలో ఓడిపోతే తనకేలాంటి శిక్ష లభిస్తుందో? వెనక్కు తిరిగి పారిపోదామనుకున్నాడు. కాని పోయి మాత్రం ఏం చేస్తాడు ఎంత కాలం రూపహీనంగా తిరుగుతాడు ఇందాక యమదూతలను బెదిరించాడే గాని, నిజంగా వాళ్ళు వెళ్ళిపోతే వాళ్ల వెంబడే పోయేవాడు.

ఆలోచిస్తూ ముగ్గురు ముందరకు సాగారు. కొంత దూరం పోయాక భగభగ మండే మంటల్లోకి నెట్టబడి లబోదిబో మని ఏడుస్తూ కొంతమంది కనిపించారు. వెంకట్రావు ఝల్లు మన్నాడు శరీరం కంపించింది. తనగతి ఏవవుతుందో? అనుకుంటూ నెమ్మదిగా వెళ్ళుతున్నాడు వాళ్ళను చూస్తూ. అందులో తనకు ముఖపరిచయమైన వాళ్ళు చాలా మంది ఉన్నారు. తనను మోసం చేసిన శెట్టి గూడా అందులోనే ఉన్నాడు. అతన్ని చూడగానే వెంకట్రావుకు కోపం ఆనందం కలిగాయి. ఆ దుర్మార్గుడికి అంతే శాస్తి కావాలి. ఎంతమందిని మోసం చేశాడు. ఎంత సరుకు బ్లాక్‌లో అమ్మాడు. ఇటువంటి వాళ్ళు పదిమంది ఉండబట్టే బారతదేశం ఆహార ధాన్యాల కోసం ఇతర దేశాల దగ్గర నుంచి అప్పులు తీసుకోవలసి వచ్చింది. నిజంగా ఇటువంటి వాళ్ళే అసలు సిసలు దేశద్రోహులు.

'త్వరగా రావయ్యా స్వామీ' అన్న లంబూ పిలుపుతో ఈ లోకం లోంచి ఆ లోకం లోకి వచ్చి వాళ్లను అనుసరించ సాగాడు. దారిలో ఎన్నో ఘోరాలు కనిపించాయ్. ఎంతోమంది ఎన్నో రకాల బాధలతో గిలగిల్లా పోతున్నారు వాళ్లలో ఎక్కువ మంది ప్రముఖులే ఉన్నారు ఒక్కొక్కళ్ళనుచూస్తుంటే వెంకట్రావుకు ఆశ్చర్యం వేసింది. అక్కడ ఉన్న వాళ్లలో చాలా మందిని భూమ్మీద ప్రజలు దేవుళ్లుగా తలచి పూజించారు అటువంటి వాళ్ళు నరకంలో ఉన్నారు

'అది సరేగాని, మీ నరక లోకంలో జనాభా చాలా ఎక్కువగా ఉందే' అన్నాడు వెంకట్రావు.

'అవును, రోజురోజుకూ ఎక్కువయిపోతుందే కాని తక్కువ కావటం లేదు.

# యమలోకయాత్ర

స్వర్గం దాదాపు ఖాళీగా ఉంది అష్ట దిక్పాలకులు కాక ఎవరో ఇద్దరున్నారు. జనం లేక పోయేసరికి దిక్పాలకులకు కూడా బద్ధకం వేసింది. కార్తీకమాసం వెళ్లినా కూడా వానదేవుడు నిద్ర లేవలేదు సరే గాలి దేవుడ్ని ఎవరన్నా నిద్రలేపితే ఒక్కసారి గబగబా ప్రపంచం అంతా చుట్టేసి మళ్లీ వచ్చి పడుకుంటున్నాడు. అగ్ని దేవుడికి కూర్చొని, కూర్చొని విసుగు పుట్టి ఒక్కసారి భూలోక సంచారం చేసివస్తాడు. ఒకసారి భూమ్మీదకు పోయాడంటే మళ్లీ ఏ రెండు మూడు నెల్లకో గాని రాడు. స్వర్గంలో జనాభా ఉన్నట్టయితే తమ ప్రజలకు మేలు చేసేవాళ్లే కాని ఎవ్వరూ లేరు మహామునులంతా తపస్సు చేసుకోవానికి వెళ్లారు ఇప్పుడు త్రిమూర్తులు స్వర్గం కొన్నాళ్ళపాటు తీసేసి నరకం యొక్క ఇంకొక శాఖను అక్కడ స్థాపిద్దామనుకుంటున్నారు ఈ విషయాన్ని గురించి భాద్రపద మాసంలో చర్చిస్తారట.'

వెంకట్రావు భాద్రపద మాసం ఎప్పుడు వస్తుందని అడుగుదామనుకున్నాడు. కాని ఇంతలోకి ఘంటారావం వినపడింది. అది న్యాయస్థానంయొక్క ఘంట ఆరోజు జనం ఎక్కువగా లేరు. కారణం ఆరోజు స్పెషల్‌రోజు కొద్ది పాపాలు చేసినవాళ్లకు మాత్రమే విచారణ జరుగుతుంది. ఒక పదిమంది కంటే ఎక్కువలేరు అందులో ఆఖరివాడు వెంకట్రావు.

న్యాయ స్థానంలోకి వెంకట్రావును తీసుకువెళ్లారు యమన్యాయస్థానం అతను అనుకున్నట్లు భయంకరంగాలేదు' సాధారణంగా ఉన్నది' ముద్దాయిలు నిలుచోటానికి ప్రత్యేకించి బోనులేదు న్యాయమూర్తి ఎదురుగా నిలబడి మాట్లాడవచ్చు అది చాలా విశాలమైనగది. గదిలో దాదాపు 20 స్తంభాలు ఉన్నాయ్ ఒక్కొక్క స్తంభం దగ్గర ఒక్కొక యమదూత ఉన్నాడు ఆగది చూడగానే ప్రతి ఒక్కడికీ తాముచేసిన పాపాలమీద తమకే అసహ్యం పుడుతుంది. అయినా వాళ్ల అహంకారం నశించదు. ఏలాగైనా శిక్షపడకుండా తప్పించుకోవాలని చూస్తారు.

కాని వెంకట్రావుకు ఆవూహ కలులేదు తను మళ్లీ బ్రతకాలి వెంకట్రావుకు ఇదే ఆలోచన. అందరు పాపుల విచారణ అయింది. తానే చివరివాడు

'పారాయణం వెంకట్రావు' చిత్రగుప్తుడు గావుకేక పెట్టాడు. యమభటులు అతన్ని న్యాయపీఠంవద్దకి తీసుకువెళ్లారు. న్యాయపీఠానికి ఎదురుగ ఉన్న ఆసనంలో యమధర్మరాజు ఆసీనుడై ఉన్నాడు. మానవులు ఊహించినట్లు ఆయన భయంకరంగాలేడు. చిరునవ్వు ముఖంతో దేదీప్యమానంగా వెలిగిపోతున్నాడు.

'బాబూ నీ పేరేమిటి? సౌమ్యంగా అడిగాడు యమధర్మరాజు వెంకట్రావు, ఆయన అలా మాట్లాడతాడని కలలోకూడా అనుకోలేదు. ఆయన కర్కశంగా ఉంటాడని. కఠిన హృదయుడని తను ఎన్నో సార్లు భూలోకంలో విన్నాడు కాని అతను అనుకున్నదానికి వ్యతిరేకంగా జరుగుతున్నది'

'వెంకట్రావు' నెమ్మదిగా జవాబు చెప్పాడు.

యముడు, చిత్రగుప్తుని వైపుకు తిరిగి, 'చిత్రగుప్తా! ఇతడు చేసిన నేరాలేమిటి?' అడిగాడు.

చిత్రగుప్తుడు జవాబు చెప్పాడు; 'ప్రభూ! ఇతడు నాలుగు వందలసార్లు అబద్ధం చెప్పాడు. వందమందిని మోసం చేశాడు లెక్కలేనన్ని చిన్నప్రాణాలను చంపాడు. అఖరుకు ఆత్మహత్య చేసుకున్నాడు

వెంకట్రావు ఆ ఆఖరిమాట వినేటప్పటికి కోపమొచ్చింది.

'ప్రభూ! ఈ చిత్రగుప్తునికి కొంచెం మతి చలించి ఉంటుంది. లేకపోతే నేను చనిపోయేటప్పుడు నిద్రమత్తులో జోగుతుంటాడు నేను ప్రమాదవశాన చనిపోయాను కాని ఆత్మహత్యకాదు.'

చిత్రగుప్తుడు వెంకట్రావు వంక ఉరుముతూ చూశాడు. యమధర్మరాజుమాత్రం సౌమ్యంగానే, 'బాలకా! చిత్రగుప్తుని చిట్టాలో ఇంతవరకు ఎవ్వరూ తప్పు పట్టలేదు నీవు చెప్పింది తప్పైతే నీకు ఎక్కువ శిక్ష ఉంటుంది. చెప్పు ఎలా చనిపోయావ్!' అడిగాడు.

'ధర్మరాజ! నేను నిన్నటివరకు ఒక నిరుద్యోగిని నా తల్లిదండ్రులు ఈ

(63వ పేజీ చూడండి)

# భర్తను లొంగదీసుకోవడము ఎలా?

పరిమళా సోమేశ్వర్

భర్తను లొంగదీసుకోవటానికి రెండవ స్టెప్ ఏమంటే...భార్య తను అన్నివిధాలా భర్తమీద ఆధారపడి ఉన్నట్లు నటించాలి. ఎలాటి పురుషుడికైనా తను భార్యకంటె అన్నివిషయాల్లోనూ (ఒక అందం విషయంలోతప్ప) అధికుడినన్నభావం అతనికెంతో సంతృప్తినిస్తుంది. అంతేకాక మహావృక్షానికి పెనవేసుకుపోయే లతలా భార్య తనను ఆశ్రయించుకుని ఉండాలని కోరుకుంటాడు ప్రతి భర్తానూ.

ఈ విషయాన్ని తెలివిగల భార్య అర్థం చేసుకుని తదనుగుణంగా ప్రవర్తించాలి శారీరకంగా మానసికంగా కూడా తాను అతనిముందు దుర్బలురాలినన్నట్లు కనపడాలి. మోటుగా, ధైర్యంగాఉండే ఆడదాన్ని మగవాడు ఒక్కోప్పుడు మెచ్చుకున్నా, అలాటి స్త్రీని భార్యగా ప్రేమించలేడు అంతగా. బియ్యం మూటను ఒకచోటనుండి మరోమూలకు మార్చేటప్పుడు. ట్రంకు పెట్టెను అటకమీదనుండి దించేటప్పుడు మీ ఆయన గనుక యింట్లో ఉన్నట్లయితే కొంత జాగ్రత్తగా వ్యవహరించాలి మీరు

ఏదేమంటే ఒకవేళ మీకు ఆ పెట్టెలను మూటలను ఎత్తగల బలం ఉన్నప్పటికి 'అబ్బ! చస్తున్నాను యీ బరువులు మొయ్యలేక... ఓసారిలా వచ్చి సాయం చేయరూ?' అని సన్నగా బతిమాలే ధోరణిలో పిలవాలి శ్రీవారిని అప్పుడా మగధీరుడు అమాంతం బియ్యం మూటను ఎత్తి అవతలపడేసి 'ఓస్ యీ మాత్రం బరువుకూడా మొయ్యలేపోతే ఎలాగే సుకుమారీ? రేపు పిల్లల్నెలాకంటావు దీనికే కందిపోతుంటే?' అంటూ బుగ్గమీద ఓ చిటికవేస్తాడు. అప్పుడతని కళ్లల్లో వెలిగే గర్వరేఖలు చూసితీరాలి!

## భర్తని లొంగదీసుకోవడంలో రెండవ మెట్టు

**అతనిమీద ఆధారపడి ఉన్నట్లు ఆయనకి లొంగిఉన్నట్లు కనపడటం**



అలాగే మీరు సహజంగా మనోనిబ్బరం గలవారైనప్పటికీ పిరికివాళ్లలా నటించాలి.

ఉదాహరణకి రాత్రిపూట బయటకి వెళ్ల వలసివచ్చిందనుకోండి. 'అబ్బ. చీకట్లో నాకు భయమండీ! కాస్త తోడురారూ?' అని తియ్యగా రాగంతీస్తూ అడగాలి పిరికితనానికి ఓ విచిత్రమైన లక్షణముంది ఏదేమంటే ఒకమనిషి సహజంగా ఎంత పిరికివాడైనప్పటికి తోటివాడు కనుక తన పిరికితనాన్ని వెల్లడించి, యితని సహాయాన్ని అర్థించేడంటే ఎక్కడలేని ధైర్యాన్నీ పుంజుకుంటాడు మొదటివ్యక్తి.

కనుక పిరికిగా ఉన్నట్లు నటించటం వల్ల రెండువిధల లాభాలున్నయ్. మీ ఆయనకు మీరు తనమీద ఆధారపడి ఉంటారన్న భావం ఎంతో సంతృప్తిని, గర్వాన్ని కలిగించి సదా మిమ్మల్ని పసిపాపలా కాపాడుకుంటానికి ప్రయత్నిస్తాడు. రెండవదేమంటే ఒకవేళ స్వభావసిద్ధంగా మీవారు పిరికివారైనప్పటికీ మీ రాయన ముందు బేలగా ప్రవర్తించేసరికి తను ధైర్యస్థుడిగా మారే అవకాశం ఉంది. పిరికిగా, బలహీనంగా ఉండటం (అఫ్ కోర్స్...మోతాదులోనే ఉండాలి యీ రెండు లక్షణాలు—) స్త్రీకి ఒకరకంగా అందాన్నే యిస్తయ్ భర్త ప్రేమకు దోహదం చేస్తయ్. బేలగా, సుకుమారంగా, లలితంగా ఉన్న స్త్రీనే పురుషుడు ఎక్కువగా ప్రేమించగలడు. మితిమీరిన ధైర్యసాహసాలు, శారీరకబలం ఉన్న ఆడదాన్ని 'మగరాయడు' అంటూ చీదరించు కుంటారు చాలామంది.

అసలు సృష్టిలోనే ఉన్నది స్త్రీ పురుషులలోని వైవిధ్యం. దృఢంగా, మోటుగా ఉన్న పురుషుడికి త్వరగా లొంగిపోతుంది స్త్రీ. అలాగే మృదువుగా, సుకుమారంగా ఉన్న స్త్రీని తనలో లీనం చేసుకోవాలని కోరుకుంటాడు మగవాడు. నాజూకుగా ఉండే మగవాళ్లు ఎంత హాస్యాస్పదంగా కనపడతారో, మోటుగా ఉండే ఆడవాళ్లు అంత వికృతంగానూ కనపడతారు స్త్రీ పురుషుల మధ్యగల వైవిధ్యం ఎంత ఎక్కువగా ఉంటే వారిద్దరి మధ్య జనించే ఆకర్షణకూడా అంతబలంగానూ ఉంటుంది.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే... భర్తను లొంగదీసుకో దల్చుకున్న ఆడవాళ్లు తాము అతనికి లొంగి ఉన్నట్లు, అతనిమీద ఆధారపడి ఉన్నట్లు కనపడటం ఎంతో అవసరం! ఇదికూడా సహాయ నిరాకరణోద్యమంలా ఒక సరికొత్త రకానికి చెందిన శాంతియుత యుద్ధమే! ఈ కిటుకును గ్రహించాలి మీరు

మరో ముఖ్యమైన విషయమేమంటే అడపా దడపా మీ ఆయనతో 'మీరే నా దైవం' అన్నవాక్యాన్ని సూటిగానో పరోక్షంగానో అంటూ ఉండాలి.

అదో చదువుకున్న అమ్మాయిలకు అప్పుడే కోపంవచ్చేస్తోంది నాకు తెలుసు,

కోప్పడకుండా కాస్త శ్రద్ధగా నామాటలు వినండి, అసలు దేవుడంటే ఎవరు? మీరు నిస్వార్థంగా, స్వలాభాపేక్షలేకుండా ప్రేమించి పూజించే ఒకవ్యక్తి, లేదా మీరు చేరుకోలేని ఆదర్శాలకు, మీరు కోరుకునే ఆనందానికి ప్రతినిధిగా భాసించే ఒక అదృశ్యశక్తి—ఔనా?

ఆ వ్యక్తినో, శక్తినో గుళ్లోని లింగల్లోనో, పటాల్లోనో చూసేకన్నా, మీ జీవిత భాగస్వామి, మీ సర్వస్వం, మీ ప్రాణం...అన్నీ అయిన భర్తలోనే చూసుకుంటేనేం? అని నాప్రశ్న...ఒక్కసారి ఆలోచించండి నిదానంగా.

మీరు అద్భుతమైన సౌందర్యవంతులే కావచ్చు. మిమ్మల్నిచూసి లోకం మూర్ఛపోవచ్చు. వైజయంతీమాల, మారిలిన్ మన్రోలు మీముందు దిష్టితీయటానికి కూడా పనికిరారని మీ మొహంమీదే మిమ్మల్ని ఎంతోమంది పొగడవచ్చు కాని ఏకాంతంలో మీ భర్త 'చిట్టీ! నువ్వు చాలా అందంగా ఉంటావుసుమా! నీవంటి భార్య లభించటం నా అదృష్టం!' అన్నప్పుడు కలిగినంత ఆనందం మీకు మరెప్పుడూ కలగలేదన్నసంగతి మీరు గమనించి ఉంటారు

అలాగే మీ అందాన్ని ఎంతమంది మెచ్చుకున్నా మీ ఆయన కనుక ఒక్కసారైనా మీ అందాన్నిగురించి మాట్లాడడు; పెదవివిప్పి పొగడడు అనుకోండి. అప్పుడు మీ మనసు చివుక్కుమంటుంది. 'ఎంత అందం ఉంటేనేం? ఆయన కళ్లకు నేను సరిపడటంలేదు!' అని నిష్ఠురంగా, నిస్పృహగా, నిట్టూర్పు విడుస్తారు.





అట్లాగే మీరుచేసినకూరో, పచ్చడో మీ ఆయనకనుక మెచ్చుకుంటూ తిన్నాడంటే యింక ఆరోజు మీకు భోజనం అక్కర్లేదు. సంతోషంతోనే మీ కడుపు నిండిపోతుంది.

బయటవారితో ఏ కారణం వల్లనైనా అవమానం జరిగిందనుకోండి మీకు ఆయన నోటినుండివచ్చే ఒక్క చిన్న అనునయ వాక్యం మీలోని ఎంతటి అవమానాన్ని దుఃఖాన్నిఅయినాసరే తుడిచిపెట్టివేయగలదు. అదే తెలిసో, తెలియకో తన మాటలతో, చేతలతో, మీ భర్త మిమ్మల్ని అవమానిస్తే మీరు భరించగలరా? ఎంతమంది ఓదార్పులు, అనునయాలుకూడా మీలోని ఆవేదనను చల్లార్చలేవు. మీ భర్త మిమ్మల్ని నిరసిస్తే, అవమానిస్తే భరించే శక్తి మీకు ఉండదు.

ఇవన్నీ ఆలోచిస్తుంటే మీకేమనిపిస్తోంది? అనాలోచితంగాగానీ, ఉద్దేశ్యపూర్వకంగా గానీ మీ జీవితాన్ని మీ భర్త దయా దాక్షిణ్యాలపైన, అతని యిష్టాయిష్టాలపైన వదిలేసి బ్రతుకుతుంటారు మీరంతా ఆ సంగతి మీకే తెలియదు.

మీకు తెలియకుండానే, మీ ప్రయత్నంతో నిమిత్తం లేకుండానే మీ సర్వస్వాన్నీ మీ భర్తకు సమర్పించుకుంటారు అందుకే భర్త అనురాగంతో పొందగలిగినంత సుఖాన్ని, భర్తతిరస్కృతిలోపొందేంత ఆవేదనను స్త్రీ మరే సమయంలోనూ అనుభవించదు.

మీ ఆయన కోప్పడితే భూమ్మని కోపం వచ్చేస్తుంది మీకు ఎదురు తిరిగి ఆయనను కూడా కోప్పడాలనిపిస్తుంది. ఎందుకో తెలుసా? మీరు యీ ప్రపంచంలో మీ భర్తను ప్రేమించినంత గొప్పగా మరే యితర వ్యక్తినీ ప్రేమించటంలేదనే దాని అర్థం. అందుకే మీ ప్రేమను మీవారు అర్థం చేసుకోకపోయినా, తిరిగి అంత ప్రేమ యివ్వటంలేదన్న అనుమానం మీకు కలిగినా, మీకు చాలా కోపంవస్తుంది.

మనం ప్రేమించే మనుషులమీద మనకి రావలసినంత కోపంవస్తుంది. ఇంకా చెప్పాలంటే ఆ ఎదుటివ్యక్తిని చంపేయాలన్నంత కోపంకూడా వస్తుంది ఒక్కొప్పుడు, ఆ కోపం వెనుక దాగిఉన్న ప్రేమ అంత గొప్పదన్నమాట!

ఈ విషయం పైకి కొంత విడ్డూరంగా




కనిపించవచ్చు. కాని నెమ్మదిగా ఆలోచిస్తే అందులోని నిజం తప్పక అర్థమవుతుంది.

ఈ ఉపోద్ఘాతమంతా దేనికంటే పైపైన భర్తమీదకు తారాజువ్వల్లా చీటికీ మాటికీ లేచే గయ్యాళిభార్యలు, 'మీరూ నాకంటె ఏరకంగా ఎక్కువ? మీరూ, నేనూ పీల్చేగాలి ఒకటే, మీరూ నేను తాగే నీరు ఒకటే! మీతోపాటు నాకూ కావాలి అన్ని రంగాల్లోనూ సమానత్వం' అంటూ మొండిగా వితండవాదం చేసే అల్ట్రా మోడర్న్ భార్యలూ అందరూకూడా అంతరాంతరాల్లో భర్తమీద అవ్యాజానురాగాలు కలవారే! అయితే ఆ ప్రేమను చూపటం చేతకాని అమాయకులు వాళ్లు—అంతే!

ఎన్ని చదువులు చదివినా, ఎన్ని

ఫ్యాషన్లు నేర్చినా, ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా స్త్రీ తహ తహలాడేది, పడిచచ్చేది—భర్త ప్రేమకోసమే! ఈ విషయం గట్టిగా పైకి ఒప్పుకుంటానికి నామోషీ కొందరికి! కాని అది మాత్రం నిజం. 'పతియే ప్రత్యక్ష దైవం' అన్న సూక్తి పాత చింతకాయ పచ్చడి లాటిదే అయినా, ఆరోగ్యానికి చాలా మంచిదన్న నిజాన్ని ఏ స్త్రీ కూడా కాదనలేదని నా దృఢ విశ్వాసం.

అలాటప్పుడు భర్తను దైవంగా భావించటం, ఆ భావాన్ని భర్తకు తెలపటం ఏమంత పరువుతక్కువ పనికాదు సరికదా, దాంపత్యజీవనం స్వర్గతుల్యం కావటానికి ఎంతో దోహదకారి అవుతుంది.

తెలుగు సినిమా పతివ్రతలా 'నాథా! మీరే నా దేవుడు. నేను మీ పాదదాసిని'

## భర్తని...?

అంటూ డైలాగులు చెప్పటం నిజజీవితంలో సాధ్యం కాకపోవచ్చు. పోతే ఆ భావాన్ని అందంగా, సున్నితంగా వ్యక్తం చేసే అవకాశాలను కల్పించుకోవటం కూడా అసాధ్యం కాదనుకుంటాను.

పండగరోజు తలంటిపోసుకుని, కొత్త బట్టలు కట్టుకుని దేవుడి పటాన్నిపూజించే ముందు ఓసారి వచ్చి మీ శ్రీవారి పాదాలకు నమస్కరించండి. ఇంక ఆయన శరీరం, మనసూ మేరుపర్వత పరిమాణంలోకి విస్తరిల్లకపోతే అప్పుడనండి. అంతే కాదు. అప్పట్నుండి ఏ పండగైనా నెలాఖరున రావటం జరిగినాసరే, తప్పకుండా మీ చేతిలోకి ఒక కొత్తచీరె వచ్చిందన్నమాటే!

మా పక్కింటావిడ ఒకసారి వాళ్ళాయన ఎంతో నసపెడ్తే తప్ప పండక్కి కొత్తచీరె కొనటంలేదంటూ ఓసారి ఫిర్యాదు చేసింది నాతో. నేనే చిట్కా చెప్పేసరికి దసరా పండక్కి వాళ్ళాయన తెచ్చిన కొత్తచీర కట్టుకుంటూనే అమాంతం ఆయన పాదాలమీద వాలిపోయిందిట

ఆ మానవుడు ఎన్నడూ జరగని ఆ సంఘటనకు ఉబ్బి తబ్బిబ్బై యింకా తప్పనిసరిగా ప్రతి పండగకూ కొత్తచీర కొనిస్తున్నాడని నాతో చెప్పింది. కొత్తచీరలు ఎక్కువగా కొనిపించాలన్న కోరిక గలవారందరూ యిదే పద్ధతిని ప్రయోగం చేసి సత్ఫలితాలను పొందవచ్చు.

అలాగే ఆయనమీదగల భక్తిభావాన్ని వెల్లడించటానికి మరో మంచి తరుణం... రాత్రి పడుకొనే సమయం. రోజూ నిద్రపోయే ముందు ఓ రెండు నిమిషాల పాటు శ్రీవారి పాదాలు వత్తాలి.

చాలామంది భార్యలు భర్తలు కాళ్ళు పట్టమంటే 'ఎప్పుడూ మీకు కాళ్ళు నొప్పులేనా! అందునా నన్నుచూస్తే మరీ నొప్పులొస్తయ్ మీకు' అంటూ విసుక్కుంటారు. కాని భర్తకాళ్ళు వత్తించుకునేది నొప్పులకోసం కాదన్న నిజం చాలామంది అమాయకురాళ్ళకు తెలియదు.

భర్త పాదాలను ఏకాంతంలో స్పృశించటం... అదికూడా శృంగార క్రీడలలోని ఒక భాగమే! చిరుచీకటిలో, నిశ్శబ్ద ఏకాంతతలో, భర్తపాదాలను ఒడిలో పెట్టుకుని కూర్చున్నప్పుడు కలిగే ఆ అందమైన జలదరింపును, తియ్యని కంపనాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలంటే వాత్స్యాయనుని కామశాస్త్రాన్ని పఠించ నక్కర్లేదు. జస్టు...స్పందించగల సున్నిత హృదయముంటే చాలు స్త్రీకి!

స్త్రీ తన భర్తపాదాలను స్పృశించాలి అని పెద్దలు నిర్ణయించటంలో మరో ఉద్దేశ్యమేమంటే ప్రతిస్త్రీ భర్తనీ, భర్త శరీరాన్ని ఎంతగా ప్రేమించాలంటే, ఆయన పాదాలను కూడా అసహ్యించుకోకుండా, అవసరమైతే నెత్తినకూడా పెట్టుకునేస్థితిలో ఉండాలి—అని దాని తాత్పర్యం.

సాధారణంగా మనం ఒక మనిషిలోని శరీరభాగాల్లో పాదాలు చాలా అపరిశుభ్రమైనవిగా భావించి చులకనగా చూస్తాం.

(64 పేజీ చూడండి)

డాక్టర్ [illegible]

## ట్రాన్‌క్విలయిసర్ల వాడకం ఎక్కువ అయితే?

కొందరు మనస్సు సరిగ్గా లేనప్పుడెల్లా ట్రాన్‌క్విలయిజర్ మాత్రలు వేసుకుంటూ ఉంటారు.

ఇవి ఎక్కువగా వాడితే పార్కిన్సన్స్ జబ్బు రావచ్చు ఈ జబ్బునే 'పెరాలిసిస్ ఎజిటాన్స్' అంటారు. (పక్షవాతపు వణుకు?)

ఈ జబ్బు వస్తే నడక తడబడుతుంది ఆలోచనాశక్తి కుంటుపడుతుంది దైనికావసరాలు తీర్చుకునే శక్తి పోతుంది చర్మం రంగు మారుతుంది కండరాలు వాస్తాయి

కళ్లు పెద్దవి అవుతాయి వెర్రిమాపులు వస్తాయి నోరు తెరుచుకుని ఉండిపోయి చొంగ కారవచ్చు పని లేనప్పుడు చేతికి ఉన్న వణుకు ఏదయినా పట్టుకునేందుకు చాపినప్పుడు ఆగిపోవచ్చు

ట్రాన్‌క్విలయిసర్ మాత్రలు ఎన్ని తీసుకున్నదీ డాక్టరుతో చెప్పటం అవసరం లేదా, డాక్టరు రోగ నిర్ణయం చెయ్యలేకపోవచ్చు.




2.

ట్రాన్‌క్విలయిసర్లు వాడితే దేహంలో పొటాషియమ్ తగ్గిపోవచ్చు ఈ కొరత తీరేందుకు పళ్ళరసం, పొటాషియం మాత్రలు ఇస్తాడు డాక్టరు

ఈ చికిత్స బాగా పని చేస్తుంది.

హెచ్. ఎల్. హెర్సెన్‌సోన్
(కాపీరయిటు)

బాడిగ రామకృష్ణ సమర్పించు ఎం.వి.ఆర్. పిక్చర్స్ వారి

# ముహూర్త బలం

నిర్మాతలు:
వై.వి.వి.ఎస్.ఎస్.వి. ప్రసాదరావు
ఎం.వి. రామదాసు

దర్శకుడు:
ఎం. మల్లికార్జునరావు

కో-ప్రొడ్యూసర్:
ఎం. బాజీరావు

మాటలు:
ముళ్లపూడి

సంగీతం:
కె.వి. మహదేవన్

ఆంధ్రా నైజాం:
లక్ష్మీ ఫిలింస్

సీడెడ్:
జయలక్ష్మి



LAKSHMI



'మామకుతగ్గకోడలు'లో ముక్కామల చలం, రాజసులోచన, రంగారావు

# సినిమా

'జరిగిన కథ' చిత్ర నిర్మాత అతి త్వరలో ఒక సంపూర్ణ హాస్య చిత్రాన్ని మీకు అందివ్వనున్నారు. శ్రీ డి వి నరస రాజు విరచితంబయిన చక్కటి కథ తమ దగ్గరున్నట్టు,- యీ చిత్రాన్నికూడా శ్రీ బాబూరావు డైరెక్టు చెయ్యగలరని వెల్లడించారు

* * *

'నడమంత్రపుసిరి' చిత్ర నిర్మాతల్లో ఒకరయిన శ్రీ వందనం తన మిత్రులు కొందరితో కలిసి ఒక చక్కటి సాంఘిక చిత్రాన్ని నిర్మించనున్నారని తెలుస్తోంది. విశ్వభారతి ప్రొడక్షన్స్ బ్యానర్‌తో తయారుకానున్న యీ చిత్రానికి శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ రచన చెయ్యనున్నారని, శ్రీ ప్రత్యగాత్మ దర్శకత్వం నిర్వహించడానికి అంగీకరించారని విశ్వసనీయంగా తెలుస్తోంది

* * *



'ఖిలేంగడు'లో విజయలలిత

చిత్రసమీక్ష

# మామకుతగ్గకోడలు

ఒకరకం ప్రేక్షకులకి జానపదాలు నచ్చుతాయి మరోరకం వారికి సాంఘికాలు, మరి కొందరికి పౌరాణికాలు ఈ ఒక్కొక్క దానిలోనూ మళ్ళీ రకరకాల అభిరుచులు ఈ అభిరుచులని చిత్రనిర్మాణం అనుసరించాలని నిర్మాతల అభిప్రాయం అందుకని, అన్నిరకాల ప్రేక్షకులనీ ఆకట్టుకునే 'మిశ్రమ' చిత్రాలని నిర్మించేస్తున్నారు ఇది ఎంతవరకు లాభదాయకమో ప్రయోగాత్మకంగా పరిశీలించి తెలుసుకుంటున్నారు.

మంచి కుటుంబగాథని, హాస్యంతో మురళీ బాలాజీ ఫిలిమ్స్‌వారు 'మామకు తగ్గ కోడలు'గా ప్రేక్షకులకు అందించారు

కిల్లర్ రంగారావు పేరు చెబితే ఎంతటి వారికయినా హడల్ అతని కొడుకు చలం శోభన్ హత్య, కృష్ణమూర్తి ప్రమాదం లాంటి సంఘటనలవల్ల అతనికి తండ్రిపైన ద్వేషం అధికమవుతూ వుంటుంది. ఆ ద్వేషంతోనే నిర్మలని పెళ్ళిచేసుకుంటాడు అతని అంచనా తారుమారై తాడేపామై కరవచూస్తుంది ప్రేక్షకుల అంచనాలని తప్పుదార్లు పట్టిస్తూ హాస్యాన్ని విడదీసిన క్లయిమాక్సు అద్భుతంగా ముగుస్తుంది

ఈ కథకి ఆయువు పట్టులాంటి పాత్ర విజయనిర్మలది ఆమె చక్కని చాతుర్యంతో నటించి హాస్యాన్ని పోషించింది రంగారావు విశిష్టమైన నటన చిత్రానికి వన్నె తెచ్చింది శోభన్‌బాబు పాత్ర చిన్నదయినా వున్నంతలో ఉన్నతంగా నటించారు ప్రేక్షకులను బాగా అలరించగల పాత్రను రాజసులోచన మంచి కౌశలంతో పోషించింది చలం నటన ఒక విశేషాకర్షణగా వున్న ఈ చిత్రంలో ముక్కామల, బాలకృష్ణ, రమాప్రభ తదితర ముఖ్య పాత్రలని పోషించారు విజయలలిత, జ్యోతిలక్ష్మిల నృత్యాలు మనస్సును బాగా ఉత్సాహపరిచేట్టుగా వున్నాయి

సి యస్ రావు కట్టుదిట్టమైన దర్శకత్వంలో తయారయిన 'మామకు తగ్గ కోడలు' సంభాషణలు బి ఎల్ ఎన్ ఆచార్య రాశారు యస్ రాజేశ్వరరావు సంగీతం మధురంగా వుంది, సత్యం కెమెరా కొత్త పోకడల్లో చిత్రీకరించింది

ఇంతవరకు మన చిత్రాల్లో అత్తాకోడళ్ళ పాత్రలు తప్పితే మామా కోడళ్ళ కథలు తక్కువ 'మామకు తగ్గ కోడలు' ప్రేక్షకులకు తగిన వినోదాన్ని కొంగ్రొత్త పోకడలో అందిస్తుందనే ఆశిద్దాం

—సికరాజు

తండ్రి పరువు ప్రతిష్ట గంగపాలు చేసెందుకు లంబాడి పిల్లను
పెళ్లి చేసుకున్న ఒక సుపుత్రుని గాథ!


బాలాజీ ఫిలిమ్స్ వారి




# మామకు తగ్గ కోడలు

దర్శకత్వం
సి.యస్.రావు B.A. (L.T.)

సంగీతం
యస్.రాజేశ్వరరావు

ఆంధ్రా – రాయల
సీడెడ్ – జయలక్ష్మి
నైజాం – ఉషా

KE



'జగత్ కిలాడీలు'లో విజయలలిత

'జన్మభూమి' చిత్రాన్ని భారీఎత్తున నిర్మిస్తున్న శ్రీ టి పి సుబ్బన్న అతి త్వరలో మరొక జానపద చిత్రనిర్మాణానికి పుపక్రమించనున్నట్లు తెలుస్తుంది. 'జన్మభూమి' చాలావరకు పూర్తయింది

* * *

కౌముదీ పిక్చర్స్ అధినేత శ్రీ ఎం టిఎస్ రెడ్డి 'శ్రీ కృష్ణ విజయం' చిత్రాన్ని నిర్మించనున్నారని మీకు యిది వరలో తెలిపివున్నాను శ్రీ రామారావు

## సినిమా

ప్రధానపాత్ర పోషణకు అంగీకరించేంత వరకు ఆ చిత్ర నిర్మాణానికి పూనుకో బోరని తెలియచేస్తూ, అతి త్వరలో ఒక జానపదాన్నిగానీ, సాంఘికాన్నిగానీ నిర్మించ నిశ్చయించావని చెపుతూ, యే చిత్రం తీసినా శ్రీ రామారావు హీరోగా ఒప్పు కుంటేనే కార్యరంగంలోకి దిగగలనని వ్యక్తపర్చారు

ప్రముఖదర్శక నిర్మాత శ్రీ విఠలాచార్యను యిటీవల కలిసినప్పుడు 'ఏమండీ మన తెలుగుదేశంలో అందమయిన అమ్మాయిలె లేరా? మీలాంటి దర్శకులయినా కొత్తవారిని పరిచయం చెయ్యకూడదా' అని ప్రశ్నించాను 'నాకూ నూతన నటీమణులను ప్రోత్సహించాలని వుంది కానీ అన్నీ కలిసిరావడంలేదు ఈమధ్య విశాఖపట్నంనుండి ఒకమ్మాయి ఫోటోలు వచ్చాయి, పర్వాలేదనిపించింది శ్రీ రామారావుకూడా కొత్తమ్మాయి నెవరినయినా హీరోయిన్‌గాపెడితే బాగుంటుందేమో నన్న నా సలహాను సమర్ధించారు కాబట్టి మున్ముందు నేను డైరెక్టు చెయ్యనున్న లేక నిర్మించనున్న చిత్రాలలో కొత్తవారికి అవకాశం యివ్వడానికి ప్రయత్నిస్తాను' అని వెల్లడించారు.

### కథానాయికగా చంద్రకళ

'ఆడపడుచు' వరకట్నం చిత్రాలలో వున్నత నటనను ప్రదర్శించి ప్రేక్షకాభిమాన ధనాన్ని సంపాదించిన కుమారి చంద్రకళ దినదిన ప్రవర్ధమానురాలవుతూ వుంది. ఆమె కివ్వబడిన పాత్రను అమూలాగ్రంగా అర్ధం చేసుకుని దర్శకుని ఆదేశానుసారంగా నటించడంలో నేర్పు కన్పరుస్తుంది కుమారి చంద్రకళను శ్రీ రామారావు తాను నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో కథానాయికగా పెట్టడమే, ఆమె వుజ్వల భవిష్యత్తుకు నాంది పల్కింది అనడం సందర్భోచితం అనుకుంటాము. ఇప్పుడిప్పుడే పైకి వస్తున్న కుమారి చంద్రకళ త్వరలోనే ఆంధ్రుల అభిమానతార కాగలదనడం నిర్వివాదాంశం

### వెయ్యి అడుగులలో కుటుంబ నియంత్రణ

శ్రీ అడ్డాల నారాయణరావు మద్రాసు నుండి భాగ్యనగరానికి వెళ్ళినప్పట్నుండి యేదోఒక కార్యాన్ని నిర్వహిస్తూనేవున్నారు 'అమాయకుడు' చిత్రానికి దర్శకత్వం వహించినపిమ్మట శ్రీ అడ్డాల 'నాడూ నేడూ' అనెడి డాక్యుమెంటరీ చిత్రాన్ని డైరెక్టుచేసారు ఆంధ్ర ప్రేక్షకులకు కుటుంబ నియంత్రణ' యొక్క ఆవసరాన్ని, ఆవశ్యకతను, దానివల్ల కలిగే ప్రయోజనాలను 'వెయ్యిఅడుగుల్లో చిత్రిం

# సినిమా డైరీ

● ప్రసాద్ ఆర్ట్స్ 'సత్తెకాలపు సత్తెయ్య' జూన్ 19 న విడుదలయింది శ్రీ వి కె ప్రసాద్ నిర్మించిన యీ చిత్రానికి 'ఎదిర్‌నీచ్చల్' దర్శకుడు శ్రీ కె బాలచందర్ దర్శకుడు

● పూర్ణా ఆర్ట్సుపిక్చర్స్ 'మాతృదేవత' షూటింగు కొ కుమారి చంద్రకళ పాల్గొన్న దృశ్యాలను ప్రసాద్ స్టుడియోలో శ్రీమతి సావిత్రి చిత్రీకరించారు శ్రీ పూర్ణచంద్రరావు నిర్మించే యీ చిత్రాన్ని పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తారు

● హరిహర ఫిలింస్ 'నాటకాల రాయుడు' షూటింగు వెంకటేశ్వరా సినీటోన్‌లో పూర్తయింది శ్రీ నాగభూషణం నాయకుడిగా నటించిన యీ చిత్రానికి శ్రీ అక్కినేని సంజీవి దర్శకుడు

● పి ఎస్ ఆర్ పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రంలో శ్రీ రామారావు, శ్రీమతి విజయ జూన్ 11 నుండి, 15 వరకు పాల్గొన్నారు శ్రీ పింజల సుబ్బారావు నిర్మించే యీ చిత్రానికి శ్రీ విఠలాచార్య దర్శకుడు

● దర్శకుడు శ్రీ టి మాధవరావు 'తాళిబొట్టు' చిత్రానికిగాను విజయలలిత, కృష్ణ సూర్యకాంతం, పెరుమాళ్లు పాల్గొన్న సన్నివేశాలను విజయా స్టుడియోలో చిత్రీకరించారు. ఈ చిత్రానికి శ్రీ వెంకట్రామరాజు నిర్మాత

● అన్నపూర్ణా భవానీ పిక్చర్స్ షూటింగు జూన్ 19నుండి 24 వరకు ప్రసాద్ స్టుడియోలో జరిగింది శ్రీ బావన్నపంతులు నిర్మిస్తున్న యీ చిత్రానికి శ్రీ కామేశ్వరరావు దర్శకుడు

వారు 'ఫామిలీ ప్లానింగు' ఇప్పుడెలా వుంది? ఆదిలో ఎలావుండేది? అన్న అంశాలను ఎ వి ఫిలింస్ద్వారా చూపించారు. శ్రీ నారాయణరెడ్డి నిర్మించిన యీ చిత్రం ప్రబోధాత్మకంగానూ, ప్రయోజనాత్మకంగానూ వుండగలదని వూహించబడుతూంది.

*   *

'వాడవాడా' డాక్యుమెంటరీని నిర్మించిన శ్రీ నారాయణరెడ్డి 'మహేంద్రా మూవీస్' బ్యానర్ను స్థాపించి ఒక సాంఘిక చిత్రాన్ని శ్రీ అడ్డాల దర్శకత్వంలో హైద్రాబాదులో నిర్మించడానికి



'ఏకవీర'లో రాజ్ బాబు, మీనాకుమారి.

నిశ్చయించి జూన్ 18 న ఫిలించేంబర్లో రిజిస్టరు చేయించారు. హీరోగా క్రిష్ణను పెట్టాలనుకుంటున్నారు.

*   *   *

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు జూన్ 15 న మద్రాసుకు వచ్చారు. సురేష్ మూవీస్ అవుట్డోర్ షూటింగులో పాల్గొని, రెండురోజులు 'భలేరంగడు' పాట చిత్రీకరణలోవుండి, జూన్ 25 కు చిత్రకల్పన షూటింగులో కలుసుకోవడానికి హైద్రాబాదుకు తరలి వెళ్ళారు.

*   *   *

శ్రీయుతులు జి రామినీడు, పి ఎస్. రావు, వేదాంతం రాఘవయ్యగార్లవద్ద సహాయ దర్శకుడిగా పనిచేసిన శ్రీ మాణి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1969 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము. రచయితలందరూ ఎప్పటివలెనే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

## మొదటి బహుమతి రు. 2300

## రెండవ బహుమతి రు. 1600

## మూడవ బహుమతి రు. 550

### నిబంధనలు

1. కథలు ఇంతకిముందు అచ్చుఅవని స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంత రచనేనని, దేనికీ అనువాదంకానీ, అనుసరణకానీ కాదని హామీ రాసి పంపాలి. ఈ హామీలు వేరెకాగితం మీద కాకుండా కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయితపేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగ రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సైజు నోట్ బుక్ పేజీకి రెండురెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టిస్ట్రీట్, మద్రాసు—1'కు పంపాలి.

5. పోటీ గడువు తేదీ 30—8—69. ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచికగా' వెలువడే 7—11—69 తేది కల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుది నిర్ణయం ఆంధ్రసచిత్ర వారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యం కాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంపనవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.



కదలడు వదలడు'లో జయలలిత

## సినిమా

త్యాగరాజు జూన్ 18న అకాల మరణానికి గురికావడం విచారించదగ్గ విషయం. మాణిక్యాలరావు శ్రీ విశ్వేశ్వరరావుకు విశ్వాసపాత్రుడు. మేకప్ చీఫ్ శ్రీ భద్రయ్య నిర్మిస్తున్న చిత్రానికి దర్శకుడిగా నియమింపబడ్డాడు. ఇంతలోనే, వృద్ధిలోకి వస్తున్న ఆయనని దైవం చిన్నచూపు చూసింది.

**రామారావు, సరోజాదేవిలకుగల సంబంధం ఏమిటి?**

తన చిలిపి పలుకులతో ఆంధ్ర ప్రేక్షకుల్లో తనకొక ప్రత్యేకస్థానాన్ని యేర్పరచుకున్న గ్లామర్ తార సరోజాదేవి వివాహం అయినతర్వాత తెలుగు తెరపై కనిపించలేదని అనుకుంటున్న సమయంలో ఆమె శ్రీ రామారావుతో నాయికగా నటిస్తున్న తెలుగు చిత్రంయొక్క షూటింగు ప్రసాద్ స్టుడియోలో జూన్ 19న ప్రారంభమైంది. ఆ మొదటి షూటింగు సన్నివేశాన్ని మీకు తెలియచేస్తున్నాను.

శ్రీ ధూళిపాళ పత్రికా సంపాదకుడు, ఆయన కుమార్తె శ్రీమతి సరోజాదేవి, ఆమె ఒంటరిగా ఇంట్లో కూర్చుని వుంటుంది; చిన్నిచిన్నపిల్లలు ఆమెను చుట్టుముట్టుతారు, ఆ పిల్లలతో సరదాగా ఆడుకుంటూ వుంటుంది. పిల్లలు వూరుకుంటారా? ఏంచేసారు? 'మంచి కథ చెప్పక్కయ్యా' అని గోలచేస్తారు. నాకు కథలు రావంటుంది సరోజాదేవి, మరయితే పాటపాడు అంటూ పిల్లలు మారాం చేస్తారు. పిల్లల నుద్దేశించి సరోజాదేవి పాడనారంభించింది

'ఎవరో వచ్చేవేళాయె
ఎదురై కాస్త చూస్తారా
వాకిలి తెరచి వుంచారా
మరి ఒకసారి చూస్తారా—'

అంటూ పాడుతున్న సమయంలో శ్రీ రామారావు ప్రవేశించారు. 'కట్' అన్నారు దర్శకులు శ్రీ కామేశ్వరరావు. శ్రీ రామారావు సరోజాదేవి యింట్లోకి యెందుకొచ్చారు? శ్రీ ఎన్. టి. ఆర్.ను చూచిన సరోజాదేవి యేంచేసింది? వాళ్ళిద్దరికి గల సంబంధమేమిటి? అనేటి సందేహాలను లన్నిటినీ భవానీపిక్చర్స్ వారే తీర్చాలి. పైపాటను శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాసారు. శ్రీమతి సుశీలచే శ్రీ అశ్వత్థామ పాడించారు. శ్రీ బాపన్న పంతులు నిర్మించే యీ చిత్రానికి శ్రీ శాస్త్రి నిర్మాణ నిర్వాహకుడయితే, శ్రీ కామేశ్వరరావుకు శ్రీ కృష్ణమూర్తి సహాయకుడు. చిత్రంలోని ముఖ్యపాత్రలను శ్రీయుతులు రామారావు, శోభన్‌బాబు, నాగభూషణం, సరోజాదేవి, ధూళిపాళ, విజయలలిత, త్యాగరాజు పోషిస్తున్నారు.

—శ్రీనివాస్



'జరిగినకథ'లో మాస్టర్‌బాబు, కాంచన

## మీకు తెలుసా?

హిందీ చిత్ర నిర్మాత శ్రీ విజయ్ భట్ యింతవరకు నిర్మించిన 65 చిత్రాలు గణనీయమైనవే. ఇప్పుడు నిర్మితమౌతున్న అసభ్యకరమయిన చిత్రాలతో ఆ చిత్రాలు సరితూగడం లేదని బాధపడుతూ మునుముందు నాణ్యమయిన చిత్రాలకు డిమాండు తగ్గగలదేమోనని చిత్ర నిర్మాతలకు ప్రత్యేకంగా చెప్పదామనుకుంటున్నారట.

శ్రీమతి పద్మిని కుమారుడు చిరంజీవి ప్రేమానంద్ 'అష్టగ్రహకూటమి' నాడు జన్మించడంచేత అతడు అసాధారణ ప్రజ్ఞావంతుడు కాగలడని వూహిస్తున్నాదట నటి పద్మిని.

తమిళ చిత్రాలలో శ్రీ సౌందరరాజన్ రాకముందు తెలుగు గాయకుడు శ్రీ ఘంటసాల తమిళంలో పాటలు పాడేవారు.

మళయాళ నటి శ్రీమతి షీల 'భగవంతుడా, నేను నటించే ప్రతి చిత్రం శతదినోత్సవం చేసుకుంటే 100 దీపాలు వెలిగిస్తాను' అని ప్రార్థిస్తుందట.

శ్రీ పృథ్వీరాజకపూర్ బొంబాయిలో నాలుగు సార్లు శాసన సభ్యుడిగా ఎన్నికయినారట.

మధ్యనే అగ్నిప్రమాదాల్లో మరణించారు. అప్పటినుండి నేను ఏకాకిగానే బ్రతుకుతున్నాను బాచులర్ ఆఫ్ ఆర్ట్స్ అనిపించుకున్నాను. డిగ్రీవచ్చి నాలుగు సంవత్సరాలైంది. ఉద్యోగంకోసం ఎంతో ప్రయత్నించాను కాని ఏ రికమండేషన్ కాని లంచంగాని తేలేని నేను ఉద్యోగం ఎలా సంపాదించను. ఫస్ట్‌క్లాస్‌లో పాసయినా ఏం లాభం! బ్రతకటంకోసం కాఫీ హోటల్లో సర్వర్‌గా పనిచేశాను. కూలివాడిగా బ్రతికాను. అయినా ఏ రోజూ పొట్టగడిచేదిగాదు, ప్రతిరోజూ ఏదో ఒకపూట పస్తుపడుకునే వాణ్ణి అఖరికి నిన్న నా బాల్యమిత్రుడొకడు కనబడ్డాడు. అతడు పెద్ద కంపెనీకి మేనేజరు. నన్ను చూడగానే ఆప్యాయంగా పలుకరించి మాట్లాడాడు. నా స్థితితెలుసుకొని, నన్నుతన కంపెనీలో నెలకు 500 రూపాయల జీతంమీద మేనేజర్‌గా నియమించాడు. వచ్చేవారమే వచ్చి జాయినవమన్నాడు. నా సంతోషం వర్ణనాతీతం. వాడికి మనసులోనే ఎన్నో థాంక్స్ చెప్పాను. చాలాసేపు పాతవిషయాలు మాట్లాడుకున్నాం. నిన్న మధ్యాహ్నం అర్జెంట్ పనుందంటూ వాడు ఊరికి వెళ్ళాడు. నిన్న సాయంత్రంవరకు హాయిగా నిద్రపోయాను. అలా నిద్రపోయి బహుశా నాలుగు సంవత్సరాలై ఉంటుంది.

నిన్న సాయంత్రం. అదే భయంకరమైన సాయంత్రం. నాపాలిట ఆఖరు సాయంకాలం. అలా షికారుకని పార్కుకు వెళ్ళాను. ఎన్నో ఊహలు మెదిలాయ్ ఒక్కరోజులో ఎంత తేడా! మొన్న దమ్మిడీలేని బికారిని. నిన్న పెద్ద కంపెనీకి మేనేజర్ని. మొన్నటివరకు చనిపోవాలని ప్రయత్నించిన నాకు, నిన్న ఉద్యోగం రావడంతో మళ్ళీ ఆశకలిగింది ప్రశాంతమైన జీవితం గడుపుదామనుకున్నాను. రేడియోలో శ్రావ్యమైన సంగీతం వినబడుతోంది. వింటూ, రేడియోకు దగ్గరలో భావి గట్టుమీద కూచున్నాను ఏదో ఆలోచన మనస్సులో మెదలుతుంది. ఎంతసేపు కూచున్నానో నాకే తెలీదు. ఎక్కువసేపు కూచోటం వల్ల నడుమునొప్పి పుడుతోంది. బెంచి మీద కూచున్నానన్న ఊహలో ఆనుకుందామని వెనక్కి ఒరిగాను. ఏ అధారం లేక

# యమలోకయాత్ర

( 52వ పేజీ తరువాయి )

పోవడంవల్ల భావిలో పడ్డాను. పడేటప్పుడు పెద్దకేకకూడా వేశాను, కాని చీకటి పడటంవల్ల పార్కులో ఎవ్వరూ లేరు ఇదే జరిగినకథ. దీనిని గురించే అక్కడ పోలీసులు ఆత్మహత్య అనుకున్నారు ఇక్కడ చిత్రగుప్తుడు అలాగే వ్రాశాడు. కావాలంటే విచిత్రగుప్తుని పుస్తకంలో చూడండి.' అని చెప్పాడు వెంకట్రావు.

చిత్రగుప్తుడు వెలవెల బోయాడు. వాడు చనిపోయేటప్పుడు తను బ్లాకున కొని త్రాగుతున్న బ్రాందీ మైకంలో ఉన్నాడాయె! ఆ విషయం యమధర్మ రాజుకు తెలిస్తే ఇంకేమన్నా ఉందా ?

'విచిత్రగుప్తా నీ పుస్తకంలో చూడు' అన్నాడు ధర్మరాజు

విచిత్రగుప్తుడు తన పుస్తకాలన్నీ తిరగేసి,

'మహాప్రభూ! ఇతడు చెప్పిందంతా నిజమే. ఇతడు ప్రమాదవశాత్తు చనిపోయాడు. పైగా ఇంకొక విషయం. ఇతడు ఇప్పుడేపోవాలని 'అసలు చిట్టా'లో వ్రాయలేదు. 'రోజు చిట్టా'లో మాత్రం చిత్రగుప్తుల వారు వ్రాశారు ఇతని ఆయుర్దాయం 83 సంవత్సరాలు ఉంది' అన్నాడు.

యమధర్మరాజుతో వాదన పెట్టుకోకుండానే తన పని అయిపోయిందనుకున్నాడు వెంకట్రావు యముడు చిత్రగుప్తునివైపు ఉరుముతూచూచి, 'నీపని తరువాత చూస్తాం' అని వెంకట్రావు వైపుతిరిగి, 'వెంకట్రావ్! నీ ధైర్యానికి మెచ్చుకున్నాం నీ ఆయుష్యం పూర్తిగాక ముందే నిన్ను తీసుకు వచ్చినందుకు చాలా విచారిస్తున్నాం నీ ఆయుష్యం ఇంకొక 6 సంవత్సరాలు పెంచుతున్నాం. నీవు మళ్ళా బ్రతకటానికి అనుజ్ఞ ఇస్తున్నాం' అంటూ చెయ్యి ఎత్తాడు.

మరుక్షణం, భూలోకంలో ఉన్న వెంకట్రావు శవం కదలటంచూసి అప్పుడే వచ్చిన 'ఒన్‌వేట్రాఫిక్ డాక్టర్', పోలీసులు కూడా ఆశ్చర్యపోయారు ●

# భర్తని...?

( 56వ పేజీ తరువాయి)

అందుకే ఎవరి పాదమైనా పొరపాటున మనకి తగిలినా కోపంవస్తుంది. అలా సామాన్యంగా మనచేత నిరసింపబడే ఆ పాదాలు గనుక భర్త తాలూకువైనట్లయితే అప్పుడు అలాటి పాదాలనుకూడా ప్రేమించి పూజించగలంత గొప్పగా స్త్రీ తనభర్తని ప్రేమించాలి—అని పెద్దల అభిప్రాయం.

అంతే తప్ప భర్త పాదపూజ చేయాలి అంటే ఏదేదో సినిమాలో సూర్యకాంతం చేసినట్లు మొగుణ్ణి నోరారాతిడుతూ దభీల్న ఆ మొగుణ్ణి కిందపడేలా లాగి, కాళ్ళు పళ్ళెంలోపెట్టి కడగటం కాదు.

ఇంకో విచిత్రమేమంటే ఒక్కో సమయంలో పాదస్పర్శవల్ల కలిగినంతటి తన్మయభావం మరే యితర శరీర భాగాలను స్పృశించినప్పుడుకూడా కలగదు. ఉదాహరణకి మీకు ఏకారణం వల్లగానీ, లేదా అకారణంగా గాని అమితమైన ఆవేదన, విస్పృహ కలుగుతుం దనుకోండి. అలా సమయం సందర్భంలేకుండా గుండె పుట్టెడు దిగులుతో నిండిఉండటం ప్రతి మనిషికీ ఎప్పుడో ఒకసారి అనుభవంలోకి వస్తుందనే అనుకుంటాను. అలాటి, సమయంలో కనుక మీ భర్త పాదాలను గుండె కానించుకుని అలా కళ్ళు మూసుకుని ఐదు నిమిషాలు పడుకున్నారంటే అప్పుడు మీకు కలిగే ఉపశమనం, ఆ అలౌకికమైన ప్రశాంతత ... మూరుసార్లు రామనామం జపించినా కలగదని నిస్సందేహంగా మీరే చెప్తారు

ఇంతకుముందు చెప్పినట్లు శృంగార సన్నివేశాలలోకూడా పాదస్పర్శవల్ల అనేక వింత అనుభవాలు, కలిగే అవకాశం ఉంది. పాశ్చాత్యులు ప్రేమాతిశయంలో పురుషుడు తన ప్రేయసి పాదాలను ముద్దుపెట్టుకున్నట్టు తరచు వర్ణిస్తారు. ఐతే ఆ చర్యలోని శృంగారభావాన్ని, అలౌకికమాధుర్యాన్ని వాస్తవిక జీవితంలో అనుభవంలోకి తెచ్చుకోగల అదృష్టం లోకంలో ఏ కొద్దిమందికో మాత్రమే ఉంటుంది. అలాగే ఎంతో చాదస్తులుగా కనపడే మన వాళ్ళుకూడా స్త్రీలోని శరీరావయవ భాగాలన్నీ చుంబన యోగ్యమైనవన్న సంగతిని ఒప్పుకున్నారు. సత్యభామ శ్రీకృష్ణుడిని ఎడమకాలితో తన్నిందన్న విషయాన్ని విని రసికుడైన పురుషుడెవడూ ఆశ్చర్యపోడు. కోపం తెచ్చుకోడు.

ఇంతకీ నేను చెప్పేదేమంటే భర్త పాదాలను ముట్టుకోవటం పరువుతక్కువ పని అని ఆధునిక స్త్రీలు భావిస్తే అది పొరపాటంటాను నేను. 'ది వేటు హార్ట్ ఈజ్ త్రూస్టమక్' అని యింగ్లీషులో నానుడి.

అలాగే భర్త హృదయాన్ని చేరుకోటానికి పాదాలనుండి వెళ్ళే త్రోవ చాలా దగ్గర మార్గమని నాసిద్ధాంతం! పైగా పాదస్పర్శద్వారా శృంగారభావాలను ప్రకోపింపజేసే విషయంలోని నిజానిజాలను తెలుసుకోవాలన్న కోరిక గనుక ఉంటే ఒక సెక్స్ సైకాలజిస్టును కన్సల్టు చెయ్యండి.

'భర్త నాకంటె అధికుడని ఎందుకు భావించాలి? ఆభావానికి నేనెందుకు దోహదం చెయ్యాలి?' అని కొందరు ప్రశ్నించవచ్చు.

అలాటివారిని నేనడిగేది 'మీ అందాన్ని మిమ్మల్ని సదా మీ భర్త పొగుడుతూండాలని ఎందుకు కోరుకుంటారు?' అని. ఈ ప్రశ్నకు మీరిచ్చే సమాధానమే ఆ పై ప్రశ్నకుకూడా వర్తిస్తుంది

ప్రకృతి సిద్ధంగానే స్త్రీపురుషులిద్దరిలోను కొన్ని బలహీనతలవంటి గుణాలు జీర్ణించుకుపోయిఉంటయ్. ఎంత కురూపి అయిన స్త్రీ అయినా భర్త తనని అత్యంత సౌందర్యవతిగా భావించాలని కోరుకుంటుంది. అలాగే సహజంగా ఎంత అల్పుడైన పురుషుడైనా, భార్య తనని గౌరవించాలని, ఆరాధించాలనీ కోరుకుంటాడు.

ఇక్కడ కావలసింది ఎదుటివ్యక్తి 'అహాన్ని' సంతృప్తిపరచటం. ఐతే యీ రకమైన 'అహం' హద్దుల నతిక్రమించనంతవరకు అందంగానే కనపడతుంది. ఈ రకమైన 'అహం' దాంపత్యజీవితానికి అందమైన తళుకుల నద్దుతూ, రంగులు పులుముతూ నిత్యనూతనంగా కనపడేట్టు చేస్తున్నంతకాలం వాంఛనీయమైన లక్షణమే! పైగా మీమటుకు మీరు మాత్రం, భర్త ఎప్పుడైనా 'నువ్వు నా దేవతవి' అంటే ఎంతగానో సంతోషించరూ? అలాగే మీ భర్తకూడాను.

ప్రతివ్యక్తి తను మనస్ఫూర్తిగా ప్రేమించే వ్యక్తిలో దైవత్వాన్ని చూడటానికి ప్రయత్నిస్తాడు అది సహజం. తన భర్తలో దైవాన్ని చూడగలిగిన స్త్రీ ఎప్పుడూ భర్తచేత దేవతలానే ఆరాధించబడుతుంది.

(పైవారం భర్తకికోపం వచ్చినప్పుడు ఎలా ప్రవర్తించాలి?)





Editea, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

# సవ్యమైన పెంపకానికి రక్తి బోర్న్‌విటా శక్తి!

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు. వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాల అవసరం తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు

రుచికరమైన శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారుచేసేవారు—క్యాడ్‌బరిస్




**శక్తి, ఉత్సాహం — మరియు రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!**

Bensons/0391/TEL

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



# ఆంధ్రసచిత్రవారపత్రిక

| | ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 | 5 | 1 |
| | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 9 |
| జూలై | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 6 |
| | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 9 |
| | 27 | 28 | 29 | 30 | 31 | | | |